# చందమామ

ఈ సంచికలో కథలు
వింతలు - విశేషాలు

★



ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో
ఆకర్షణలు.




LIFEBUOY
SOAP
LIFEBUOY SOAP

# పాఠకుల లేఖలు

## మే 1962

"భూతాలు చేసిన పెళ్ళి" ఈనెల "చందమామకు వన్నె తెచ్చినది.

—పువ్వాడ వెంకటేశ్వర్లు, బాపట్ల

గుండు భీమన్న మే నెల తర్వాత వెళ్ళిపోతున్నాడని తెలిసి నిండుగా దుఃఖిస్తున్నాము.

—డి. రామలింగరాజు, భీమవరం

వేటకాడు తన వేటకుక్కతో అడవికి పోయి దూరంలో ఒక కుందేల్ని చూశాడు. దాని పైకి కుక్కను పోనిచ్చి తుపాకితో కాల్చాడు. చురుకైన కుందేలి పొదుళ్ళ చాటున మాయమైంది. వేటగాడు వదిలిన గుండ్లు కుక్క కాలికి తగిలి కుయ్యోమయ్యో అని అరచింది. వేటగాడు దాని కాలికి కట్టు కట్టి ఇంటికి పోయాడు. ఈ కథ మీరు వ్రాయలేదు ఎందుకని అడిగాను. వాళ్ళకు చాత కాలేదు. నువ్వు వ్రాసి పంపించు అన్నాడు అన్నయ్య.

—కనక దుర్గాంబ, బోలక్‌పూర్

రామాయణంలో బొమ్మలు చాలా బాగుంటున్నాయి. గుండు భీమన్న కథలు వచ్చే నంచికతో అయిపోతాయన్న ప్రకటన చూసి చాలా విచారిస్తున్నాను. "అణాతో ఐశ్వర్యం" చాలా బాగుంది.

చామర్తి వెంకట చలపతిరావు, రాజమండ్రి

ఈసారి చందమామ చాలా బాగుంది. "అణాతో ఐశ్వర్యం", "శాప విమోచనం", "గుర్రమెక్కి పెళ్ళికొడుకు", "విద్య మహిమ" మొదలగు శీర్షికలు అమోఘంగా ఉన్నాయి.

—కె. ఆర్. చంద్రప్రకాశ్, మదనపల్లి



ధూత్‌పాపేశ్వర్

# బ్రాహ్మీ ఆమలా

కేశవర్ధక్ తైలం





ధూత్‌పాపేశ్వర్ ఇండస్ట్రీస్ లిమిటెడ్ పన్‌వెల్-బొంబాయి

---




# నోపిన్




# మార్గ్యూఎన్టమ్

నీమ్‌క్రీమ్

దురదలు, మొటిమలు, స్ఫోటకపు మచ్చలు, కురుపులు, గాయములు, పుండ్లు, మొ. వాటికి

దక్షిణ ఇండియా ఆఫీసు: 5/149, బ్రాడ్వే, మద్రాసు-1.



త్వరలో విడుదల
పి.కన్నాంబ సమర్పించు
వరలక్ష్మి పిక్చర్సు వారి
దక్షయజ్ఞం
(అత్యుత్తమ పౌరాణిక చిత్రం..)
రచన ఆరుద్ర దర్శకత్వం కె.బి.నాగభూషణం
రాజశ్రీ రిలీజ్
MOULIS




## చకచకా పెరగాలి...
## చురుకుగా తిరగాలి...

ఏడాదిలో ఎన్ని విద్దెలు నేర్చుకోవాలనీ! పాకాలి దేకాలి అడుగులు వెయ్యాలి. ఈలోగా – ఈ యేడాదిలోనే బరువు రెట్టింపు పెరగాలి. పాపాయి ఇన్ని పనులు సాధించి చక్కబెట్టాలంటే తలిదండ్రులు అడుగడుగునా ఆదుకోవాలి. అజీర్తిచేసి పాప ఆరోగ్యం దెబ్బతినకుండా చూడడం తలిదండ్రుల బాధ్యత.

ఇందుకు అమృతాంజన్ లిమిటెడ్ వారి గ్రైప్ మిక్శ్చర్ అన్నివిధాలా తగినదని డాక్టర్లు చెబుతున్నారు. అది హాయిగా ఉంటుంది. చక్కగా పనిచేసి ఫలితాలు చూపిస్తుంది. పాలపళ్లు మొలిచే వేళల్లో పాపల కేమాత్రం బాధలేకుండా చూస్తుంది.

మీ పాపాయికి ప్రతి ఉదయం, అమృతాంజన్ లిమిటెడ్ వారి గ్రైప్ మిక్శ్చర్ ఒక టీ స్పూను పాటి పట్టండి. పాప తన పనులన్నీ చకచక చక్కబెట్టుకు చక్కగా పెరిగి తిరుగుతుంది




# అమృతాంజనము
లిమిటెడ్‌వారి
# గ్రైప్ మిక్శ్చర్

తయారుచేయువారు : అమృతాంజన్ లిమిటెడ్ మద్రాసు-4 బొంబాయి-1, కలకత్తా-1, న్యూఢిల్లీ-1.

JWT/AM/G-1417

# ఎక్కువ గాలి...

... తక్కువ కరెంటు ఖర్చు

ఒకటో రకమైన విధముగా పనిచేసేలా డిజైను చేయబడిన గణేశ్ డిలైట్ పంకాలు ఏమీ బాధ లేకుండా ఏళ్ల తరబడి పని చేస్తాయి. 36", 48", 56" మరియు 60" సైజులలో లభించే, సొగసైన గణేశ్ డిలైట్ పంకాలకు దిట్టమైన నిర్మాణము, చూడ ముచ్చటైన డిజైను మరియు అందమైన ఫినిష్ కలవు, వీటి రెక్కలను అమర్చం ఎంతో సులభము !



# గణేశ్

డిలైట్ పంకాలు

గణేశ్ ఫ్లోర్ మిల్స్ కంపెనీ లిమిటెడ్
64/65, నజఫ్‌గఢ్ రోడ్, న్యూ ఢిల్లీ-15

---

కన్యాకుమారి, తిరునల్వేలి జిల్లాలకు పంపకదారులు:—నెల్లైయ్ ట్రేడింగ్ & కంపెనీ,
177, వెస్ట్ కార్ స్ట్రీట్, తిరునల్వేలి టవున్.

మద్రాసు విక్రయశాల:—నం. 2, తంబుచెట్టి స్ట్రీట్, మద్రాసు.
(టెలిఫోన్ నం. 21680)

ఉత్తర ఆర్కాట్ జిల్లాకు పంపకధారులు:—ఆగ్రానీ ఎలక్ట్రికల్స్,
478, మెయిన్ బజార్, వేలూరు.

JWT GF-2121A

...అంతరాష్ట్రీయ ఖ్యాతిగాంచిన భారతీయ నృత్యతార

# కమలా లక్ష్మణ్

వారి

మెచ్చికకు పాత్రమైనవి..

ఫ్యాషన్..

వన్నెలు..

నమూనాలు..

నాగరికత..

వీటికొరకు

శ్రీ
వెంకటేశ్వర
సిల్క్ చీరలు

శ్రీ వెంకటేశ్వర
సిల్క్ ప్యాలెస్
స్త్రీల ఉన్నతమైన వస్త్రాలకు
రమ్యమైన స్థలం
284/1, చిక్కపేట, బెంగళూరు-2
ఫోన్: 6440
టెలిగ్రాం: "ROOPMANDIR"

M.H.Rao



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ సంచికతో గుండు భీమన్న "చందమామ" పాఠకుల వద్ద సెలవు పుచ్చుకుంటున్నాడు. అతని పట్ల పాఠకులు చూపిన వాత్సల్యాభిమానాలు అపూర్వమైనవి. మరువరానివి. చాలామంది పాఠకులు తాము గుండు భీమన్న కథలు రాస్తామని ముందుకు వచ్చారు. అంత శక్తిమంతులైన పాఠకులు నిజంగా ఉంటే హాస్య కథలు రాసి పంపండి.

లోగడ పాఠకులను సంతోషపెట్టిన తాతయ్యను ఈ నెల తిరిగి తీసుకువచ్చాము. మళ్ళీ తాతయ్య పిల్లలకి చిన్న చిన్న కథలు చెబుతాడు. ఈ సంచికలో మీరు చదివే "అసత్యవాది" అన్న కథ టి. బ్రహ్మరెడ్డి అనే పాఠకుడు పంపినది.

సంపుటి : 30 మే 1962 : సంచిక 5

CHITRA



# భారత చరిత్ర



అశోకుడి అనంతరం మౌర్యసామ్రాజ్యం విచ్ఛిన్నమయింది. దానితోబాటు భారత చరిత్రలో శాఖోపశాఖలు ఏర్పడ్డాయి. వేరు వేరు ప్రాంతాలలో వేరు వేరు రాజులు విజృంభించి చరిత్ర గతిని భిన్నమార్గాల నడిపించారు.

అశోకుడి వారసులను గురించి కూడా వేరు వేరు గాధ లున్నాయి. పురాణాలలో కుణాలు డనేవాడు అశోకుడి అనంతరం రాజయినట్టున్నది. కాశ్మీరు చరిత్ర గ్రంథాలలో జలౌకుడు రాజయినట్టుగా రాసి ఉన్నది. వీరు అశోకుడి కుమారులు. అశోకుడి సామ్రాజ్యాన్ని అతని కుమారులు పంచుకుని ఉండవచ్చు. అశోకుడి శాసనాలలో తీవరుడనే కొడుకు పేరు మాత్రమే కనిపిస్తుంది; అయితే ఈ తీవరుడు ఏ ప్రాంతానికీ రాజయినట్టు కనబడదు. కుణాలుడి తరవాత బంధుపాలితుడు రాజ్యంచేశాడని పురాణాలు చెబుతున్నాయి. బౌద్ధ జైన గ్రంథాలలో కుణాలుడి మరొక కొడుకని చెప్పబడిన సంప్రతి (లేక సంపది) అనేవాడు కుణాలుడి అనంతరం చాలా మంది రాజ్యంచేసిన పిమ్మట పాటలీపుత్రాన్నీ, ఉజ్జయినినీ పాలించినట్టు పురాణాలలో చెప్పి ఉన్నది. సంప్రతికి ముందు పాలించినవారిలో దశరథు డనేవాడు ఉన్నాడు. అశోకుడి అనంతరం కొద్ది కాలానికే ఈ దశరథుడు మగధను పాలించాడు. ఇతను ఆజీవికులనే వారికి గుహలు దానం చేసినట్టు బీహారులోని నాగార్జునీ కొండలలో శాసనాలు దొరికాయి.

దశరథుడికీ, సంప్రతికీ అనంతరం శాలిశుకు డనేవాడు రాజ్యం చేశాడు. గార్గి సంహిత అనే జ్యోతిష గ్రంథంలో ఇతని పేరున్నది. ఇతను దుష్టుడు. ఇతని అనంతరం దేవవర్మ, శతంధనువు; బృహద్ర

8. మౌర్యసామ్రాజ్య విచ్ఛిత్తి

ఘుడు అనే వాళ్ళు రాజులైనట్టు పురాణాలు చెబుతున్నాయి. బృహద్రధుణ్ణి అతని సేనా నాయకుడైన పుష్యమిత్రు డనేవాడు రాజ్య భ్రష్టుణ్ణి చేసి, తానే రాజై, శుంగవంశాన్ని స్థాపించాడు.

కాశ్మీరం మౌర్యుల అధీనం నుంచి ఇత రుల కిందికి పోయినట్టు కాళిదాసు రచిం చిన "మాళవికాగ్నిమిత్ర" నాటకంలో సూచించబడి ఉన్నది. క్రీ. పూ. మూడవ శతాబ్దం అంతమయేనాటికి కాబూలు లోయకు సుభాగసేను డనేవాడు రాజై, తన రాజ్యాన్ని సింధులోయ వరకూ విస్తరించు కున్నాడు. ఇతను మౌర్యుడుకాడు.

మౌర్యసామ్రాజ్యం బలహీనం కావటా నికి అశోకుడి అహింసా విధానం కారణం కావచ్చు. సామ్రాజ్యం బలహీనపడగానే తిరిగి యవనులూ (గ్రీకులు), ఇతర అనాగ రిక జాతులవారూ వాయువ్య ప్రాంతం మీదుగా వచ్చిపడ్డారు. గాంధారం(వాయువ్య సరిహద్దు ప్రాంతం)లోనూ, శాకల (ఉత్తర పంజాబు నడిమి) ప్రాంతంలోనూ బలమైన విదేశీయ రాజ్యాలు వెలిశాయి. దక్షిణ ప్రాంతాలు స్వతంత్రమై మగధ సామ్రా జ్యాన్ని తలదన్నే సంస్కృతిని పెంపొం దించుకున్నాయి.



మగధనూ, దాని పరిసరాలనూ శుంగ వంశీయులు స్వాధీన పరచుకున్నారు. వీరు భారద్వాజ గోత్రీయులైన బ్రాహ్మణులట. మొదటి శుంగరాజైన పుష్యమిత్రుడి రాజ్యం దక్షిణాన నర్మదాతీరం వరకూ, పశ్చిమోత్త రంగా పంజాబులోని జాలంధర్, సయాల్ కోటల వరకూ ఉండేది. పుష్యమిత్రుడి రాజధాని పాటలీపుత్రమేగాని, యువరాజైన అగ్నిమిత్రుడు తన కొలువును విదిశ (తూర్పుమాల్వ)లో ఏర్పాటు చేసుకున్నాడు.

శుంగరాజులకు యవనుల ఒత్తిడి జాస్తి అయింది. ఈ ఒత్తిడిని గురించి పతంజలీ, కాళిదాసూ మొదలైనవారు తమ గ్రంథా

లలో రాశారు. అంతకంతకూ తీవ్రమౌతున్న యవనుల దౌర్జన్యాన్ని అరికట్టిన వాడు అగ్నిమిత్రుడి కొడుకు వసుమిత్రుడు. ఇతను తన విజయం అనంతరం రెండు అశ్వమేధయాగాలు కూడా చేశాడు.

పుష్యమిత్రుడు 36 ఏళ్ళు రాజ్యంచేసి, క్రీ. పూ. 150 ప్రాంతందాకా పాలించాడు. అతని కొడుకైన అగ్నిమిత్రుణ్ణి కాళిదాసు "మాళవికాగ్నిమిత్ర" నాటకానికి నాయకుణ్ణి చేశాడు. క్రమంగా శుంగవంశరాజుల ప్రఖ్యాతి సన్నగిలింది. నిజమైన అధికారం వారి మంత్రులైన కణ్వుల వశమయింది. క్రీ. పూ. 40-30 మధ్యకాలంలో దక్షిణ ప్రాంతంలో ఒక మహనీయుడు బయలుదేరి శుంగులనూ, కణ్వులనూ తుడిచిపెట్టేశాడు. ఇతడు సాతవాహను డనే తెలుగువాడూ, ఆంధ్రుడూ అని పురాణాలలో ఉన్నది. సాతవాహనులు ఏలిన ప్రాంతం బళ్ళారికి సమీపంలో ఉండేదని చెబుతున్నారు. సాతవాహనుల కీర్తి శాలివాహనుడి కథలలో చిరస్థాయిగా నిలిచిపోయింది. ఈ రాజులలో జగద్విఖ్యాతి గడించిన మొదటివాడు మొదటి శాతకర్ణి. ఈయన పట్టాభిషిక్తు డవుతూనే అశ్వమేధ యాగం చేశాడు. ఈయన అనంతరం శకులు (సితియనులు) విజృంభించి శాతవాహనుల కీర్తిని అపహరించారు. కాని తిరిగి ఈ కీర్తికి మెరుగులు దిద్దినవాడు గౌతమీ పుత్ర శాతకర్ణి. ఈయన శకులనూ, యవనులనూ (గ్రీకులను,) పహ్లవులనూ (పార్థియనులను) ఓడించాడు. ఈయన సామ్రాజ్యం ఉత్తరాన మాల్వా నుంచి దక్షిణాన కన్నడదేశందాకా విస్తరించింది. ఈయన కుమారుడు వాశిష్ఠీ పుత్ర పులుమాయి, గోదావరి తీరాన ప్రతిష్ఠాన పురం రాజధానిగా ఏలాడు. సాతవాహనులలో ఆఖరువాడు శ్రీయజ్ఞశాతకర్ణి. ఇతని అనంతరం సాతవాహన సామ్రాజ్యం అస్తమించింది.





# పార్వతీ కళ్యాణము

పంచమాశ్వాసము :

అంతట రతి మూర్ఛ తేలి
కాంతునికై నలుదిక్కులు
కనులింతలు చేసి చూచె,
కళవళపడి పడిగ లేచె.

"మన్మథ! ఎటనుంటివి?" యను
మాటకు బదులిచ్చినట్లు
కట్టెదురను భస్మరాశి
కానిపించె రతిదేవికి.

మరుడు ఉగ్రశివుని కంటి
మంటలచే బూదియగుట
తెలిసినంత కుప్పగూలి
విలపించెను ఇట్టు లామె;

"కట్ట తెగిన చెఱువు నీరు
కలువతీగ నొంటిజేసి
అరిగినట్లు నీదానిని
అడవిపాలు చేసినావు.

పూ విల్తుడ! నీ మిత్రుడు
ఆ వసంతు డెం దుండెను?
అతడును శివు కోపాగ్నికి
ఆహుతి కాలేదు కదా!"

అను నేడ్పుల విని వసంతు
డదురుచు నట కేతెంచెను,
పంచశరుని మరణమునకు
పసి బాలుని వలె నేడ్చెను.

"ఓ వసంతుడ! చూడు,
ఉగ్రుడను గాడ్పునకు
ఆఱిపోయిన దీపమైనాడు నీ సఖుడు;

ఉత్పల సత్యనారాయణాచార్య



ఆ దివ్వె వత్తినయి అలమటించుచు నిచట
వెతల పొగ లెగయించు
రతిని నను కన్గొనుము.

పూల పాన్పులు మాకు పానరించు నీ విపుడు
కట్టియల చితిపేర్చగా వలసె, నే మనుదు?
చితిపేర్చి నను పతిని శీఘ్రముగ చేర్పుమా!
మా కిర్వురకు నొక్క మాటె తర్పణమిడుమ!

ఓ శివుడ! దేవహిత మొనరించు మన్మథుని
పూపుదెబ్బకు అలిగి బుగ్గి గావించెదవ?
వలరాజు పువుదెబ్బ వ్యర్థమెప్పుడు కాదు,
మీదు మిక్కిలి నీవు మిండ జంగంబౌదు!

పుష్పశర! పారాణి పూత మురియక ముందె
పోయితివి దేవతల మాయలకు లోబడుచు,
కుడికాలి పారాణి కొఱతదీర్పగ రమ్మ!
ప్రియవసంతుని కోస మయిన నిక రా రమ్ము!

ఈ కోయిలల రుతము,
ఇక మలయమారుతము,
ఈ తేనియల జళ్ళు, ఇక వెన్నెల బయళ్ళు,
ఈ మామిడుల పూత, ఇక తుమ్మెదల మ్రోత,
ఎవరి కివి కావలయు? ఇక నేమి కావలయు!

అందగాండ్రకు పోలికగు నా
సుందరాంగుని కట్టి దుర్దశ
కలుగ నా యెద పగిలిపోవదు!
కాంత లెంతటి రాతి గుండెలు!"

అని యేడ్చుచు చితి నుఱుకుట
కాయమ యత్నించుచుండ,
"చెల్లీ! శాంతింపు" మనుచు
చెవులం బడె నొక్క మాట.

హంస వాహనమున వాణి
ఆకాశము నందు నిలిచి,
"కళ్యాణీ! నీ భర్తను
కాంచగలవు శాంతింపుము.

తన సృష్టించిన దానిని
తానే కని మోహపడగ
బ్రహ్మ పైన సమ్మోహన
బాణ మేసె నీ కాంతుడు.

అపుడు బ్రహ్మ కోపగించి,
'హరుని కంటి మంటలచే
మారుడ! దగ్ధుడ వగు'మని
ఘోరమైన శాప మిచ్చె,

చెంత నున్న ధర్ముడపుడు
చేతులు జోడించి మ్రొక్క,
'ఓ విధాత! మరుడు లేక
జీవ మెట్లు కొనసాగును?

కావున మనకా కాముడు
కలకాలము కావలయును;
తన ధర్మము నెఱవేర్చెడు
దాసుని కోపింపవలదు,

అని వేడగ 'పరమేశుడు
హైమవతిని పెండ్లాడిన
యపుడు మరుడు జీవించును;'
అని విధాత సెల విచ్చెను.

కావున నవ మన్మథుడై
కలియు గలడు నీ నాథుడు;
చింతింపక అంత వఱకు
చెల్లీ! ఓర్పు వహింపుము"—

అని వచించి బ్రహ్మ పత్ని
ఆమెకు దయతోడ నొసగె
ఎట్టి బాధ రానీయని
ఇంద్రజాల షడ్విద్యలు.

రతి కన్నీరులతో భా
రతికి సమస్కృతి యొనర్చె;
'దీర్ఘ మాయుర'స్తని వా
గ్దేవి పలికి మాయమయ్యె.

అంత వసంతుడు కూడను
ఆమెను ఓదార్చినాడు:
"తల్లీ! మన్మథు పున రవ
తారమునకు యత్నింపుము.



మదిలో గౌరీశర్వుల
మంగళమును భావింపుము,
జననీ! వలతేని పున
ర్జన్మమునకు యత్నింపుము.

సకలలోక శుభకరుడగు
శంకరు నారాధింపుము,
తల్లీ; మన్మథు పున రవ
తారమునకు యత్నింపుము.

ఈ హిమాద్రి పరిసరముల,
ఇచ్చటనే వసియింతును,
మరుడు బ్రతికి వచ్చువఱకు
అరుదేరను స్వర్గమునకు.

తల్లీ! నీ వెటనైనను
చల్లగ తల దాచుకొనుము,
మన్మథు డరుదెంచు వఱకు
మనసు దిటవుపఱచుకొనుము—"

అని వసంతు డోదార్చిన
అప్పటికిని రతి యేడ్చుచు,
'మృతినొందెడు నాకు వాణి
బ్రతుకు మీద ఆశ గొలిపె.

ప్రాణములను మేనజేర్చి
వాణి మరల చెఱ పెట్టెను!
ఎచ్చట తలదాచుకొందు?
ఎంతకాల మిట్లుందును?

అనుచు నామె దురపిల్లుచు
అచటినుండి చనుచుండగ,
ఆమె పాద ధూళిని గొని
ఔదల దాల్చె వసంతుడు.

తరువులు కన్నీరులుగా
విరితేనెల నొలికించెను!
పక్షు లార్త రవ మొనర్చి
పరితాపము కనబఱచెను! —(సశేషం)






## 11

[బ్రహ్మదండి మాంత్రికుడు పట్టుబడిన తరవాత, జయమల్లూ, కేశవుల కోసం నగర వాసులు కొండలన్నీ గాలించ సాగారు. వాళ్ళిద్దరూ బిచ్చగాళ్ళ వేషాలు వేసుకుని నగరం లోకి పారిపోయారని, కేశవుడి ముసలి తండ్రి వాళ్ళతో చెప్పాడు. ఆ సంగతి విన్న రాజగురువు, బిచ్చగాళ్ల నందర్నీ పట్టి తెచ్చేందుకు సైనికులను పంపాడు. తరవాత—]

రాజగురువు పంపిన సైనికులూ, నగరం లోని ఉత్సాహవంతులైన యువకులూ కలిసి, కీణాలమీద కనబడిన బిచ్చగాళ్లందర్నీ పట్టుకుని, రాజనగరు కేసి నడిపించుకు రాసాగారు. ఇలా దొరికిన వాళ్లల్లో కేవలం బిచ్చగాళ్ళేగాక, బీదా బిక్కాజనం కూడా వున్నారు. మాసిన దుస్తులు ధరించి వున్న వాళ్ళూ, చిరుగుల వస్త్రాలు కట్టుకున్నవాళ్లూ కూడా బిచ్చగాళ్ళకిందే జమ కట్టబడటంతో, వాళ్ళ సంఖ్య వందలూ వేలూ దాటింది.

రాజ ప్రాసాదం ఆవరణలో మందవేయబడిన వీళ్ళందర్నీ చూసి, రాజుగారు చాలా ఆశ్చర్య పడ్డాడు. తన రాజధానీ నగరంలో కూటికీ గుడ్డకూ ముఖం వాచిన వాళ్ళు యింత మంది వున్నారని ఆయన ఏనాడూ ఊహించలేదు.

రాజూ, రాజగురువూ, బ్రహ్మదండి మాంత్రికుడూ ఆవరణలోకి రాగానే, సైనికులు బిచ్చగాళ్ళనందర్నీ ఒక సోలువుగా నిలబెట్టారు. రాజుకూ, రాజగురువుకూ



అక్కడ ఉన్నతాసనాలు ఏర్పాటు చేయబడినై. బ్రహ్మదండి పక్కగా నిలబడ్డాడు.

"గురువర్యా, మన రాజ్యం సర్వసుభిక్షంగా వున్నదని, యింత కాలంగా భావిస్తున్నాను. కాని, వీళ్ళను చూస్తూంటే మన పరిపాలనలో ఏదో లోపం వున్నట్టు కనబడుతున్నది. మహామంత్రి ఒక్కసారైనా—కనీసం సూచన ప్రాయంగా కూడా, పరిస్థితులు యింత దారుణంగా వున్నట్టు నాతో అనలేదు," అన్నాడు రాజు నిస్పృహపడుతూ.

రాజగురువు చిరునవ్వు నవ్వుతూ, "మహారాజా! ఇందులో మంత్రిగారిని తప్పు పట్టేందు కేమీలేదు. ఈ దరిద్రులందర్నీ మన బొక్కసంలో వున్న ధనం వెచ్చించి పోషించటం సాధ్యమయే పని కాదు. యుద్ధాలూ జననష్టం లేకండా ధనం సంపాయించే మార్గం ఒకటి కనబడుతున్నది," అంటూ రాజుగారి చెవిలో రహస్యంగా, "ఈ బ్రహ్మదండిని ఉపయోగించుకుని, రాకాసిలోయలో వున్న ధనరాసులు కొల్లగొట్టే మార్గం ఆలోచించుదాం," అన్నాడు.

రాజుగారి ముఖం కళకళ లాడింది. అయన బ్రహ్మదండికేసి తల తిప్పి, "బ్రహ్మదండీ, నువ్వు యికనుంచయినా, దుష్ట ప్రవర్తన మానుకుంటే, నిన్ను క్షమించగలము," అన్నాడు.

ఈ మాటలు వింటూనే మాంత్రికుడు రాజుకు సాష్టాంగ పడి, "మహారాజా, నే నెప్పుడూ మహారాజులుంగారి సేవకుడనే. దుష్టులు రేపిన పుకార్లు నమ్మి, నా రాజభక్తిని శంకించ వద్దని ప్రార్థిస్తున్నాను. తమ బొక్కసాన్ని వెండి బంగారాలతో నింపేందుకే, నేను కాలభైరవోపాసన చేసి, రాకాసి లోయకు వెళ్ళే మార్గం......"

బ్రహ్మదండి మాంత్రికుడు మాట ముగించక ముందే, రాజగురువు అందు

కుని, "బ్రహ్మదండీ, ఆ లోయ సంగతు లేవీ నువ్వు బహిరంగంగా మాట్లాడ కూడదు. నీ రాజభక్తి సంగతి నే నెరగంది కాదు, జాగ్రత్త!" అన్నాడు కఠినంగా.

బ్రహ్మదండి కుక్కిన పేనులా అయి పోయాడు. అంతలో సేనానాయకుడు అక్కడికి వచ్చి, సోలుపుగా వున్న బిచ్చగా ళ్ళందర్నీ ముందుకు నడపమన్నాడు. సైని కులు హెచ్చరించగానే బిచ్చగాళ్ళు కది లారు. బ్రహ్మదండి వాళ్ళల్లో ప్రతి ఒక్కడి ముఖాన్నీ పరీక్షగా చూస్తూ, "వీడు కాదు... ఊహుఁ, వీడూ కాదు! ఈ ముఖంలో జయ మల్లు లక్షణాలున్నా, వాడు కొంచెం పొడుగు. వీడి ఆకారం కేశవుడి ఆకారాన్ని పోలి వున్నట్టు కనిపిస్తున్నా, వీడిది కాస్త మెల్ల కన్ను...వాడివి పులి కళ్ళు!" అంటూ వ్యాఖ్యానించసాగాడు.

ఈ విధంగా బిచ్చగాళ్ళ పరీక్ష ఒక గంట కాలం పట్టింది. చివరకు వాళ్ళల్లో తమకు కావలసిన జయమల్లూ, కేశవుడూ లేరని తేలిపోయింది.

"అసలీ పుకారు లేవనెత్తిం దెవరు?" అని అడిగాడు రాజగురువు.

"ఇది అడవిలోకి వెళ్ళిన మన నగర పౌరుల ద్వారా వ్యాపించింది. వాళ్ళకు



అక్కడున్న ముసలివాడెవడో చెప్పాడట," అన్నాడు సేనానాయకుడు.

"వాడా—ఆ ముసలివాడు! వాడు కేశవుడి తండ్రి. వాడింత కపట విద్య తెలిసిన వాడని నేను నమ్మను. కేశవుడో, జయమల్లో ఈ కట్టుకథ కల్పించి వుంటారు. వాళ్ళి సరికే ఈ రాజ్యం సరిహద్దులు దాటిపోయినా, దాటిపోయి వుండవచ్చు," అన్నాడు బ్రహ్మదండి కోపంగా.

రాజగురువుకు అతడు చెప్పినదాంట్లో కొంత సత్యం వున్నట్టు తోచింది. బహుశా వాళ్ళిద్దరూ ఈ సరికి రాకాసిలోయ మార్గం పట్టి వుంటారు!




రాజుగారూ, బ్రహ్మదండి మాంత్రికుడూ, రాజగురువూ తిరిగి రాజభవనంలో ప్రవేశించారు. సేనానాయకుడు బిచ్చగాళ్ళం దర్నీ రాజ ప్రాసాద ద్వారాలు దాటించి నగరంలోకి తరిమి వేయించాడు. రాజూ, రాజగురువూ కలిసి రహస్య మంతనాలు ప్రారంభించారు.

"మహారాజా, మనం ఈ సదవకాశాన్ని చేజారి పోనివ్వకూడదు. రాకాసిలోయలో వున్న వెండీ బంగారాలను మనవిగా చేసుకోవలసిందే. ఆ విధంగా మీకూ, ప్రజలకూ కూడా ఎంతో మేలు కలుగుతుంది. ఆ గుప్త ధనాన్ని సాధించే శక్తి ఒక్క కేశవుడికే వుంటని, మాంత్రికుడు లోగడ చెప్పాడు. వాణ్ణి పట్టుకునేందుకే వాడు యింత కాలంగా ఆ కొండ మీద మాటు వేసుక్కూచున్నాడు. కేశవుడి భుజం మీద పడగ విప్పిన నల్లని పాము ఆకారం మచ్చ వున్నదట. దాని ద్వారా బ్రహ్మదండి తనకు కావలసిన యువకుడెవడో గుర్తించాడు," అన్నాడు రాజగురువు.

"కాని, వాడు మోసగించి మన చేజారి పోయినట్టు కనబడుతున్నది," అన్నాడు రాజుగారు.

"అందుకే మనం మోసాన్ని మోసంతోనే నిగ్రహించాలి. నాకో మంచి ఉపాయం తట్టింది. తమరు మరోలా అనుకోకపోతే, మనవి చేస్తాను," అన్నాడు రాజగురువు.

రాజుగారు అంగీకార సూచకంగా తలాడించాడు.

"ఆ కేశవుడు వారం రోజుల లోపల నగరానికి వచ్చేట్టయితే, అర్ధరాజ్యం యిస్తామని చాటింపు వేయించుదాం. ఆ గడువు లోగా వాడు రాకపోతే, వాణ్ణి ప్రాణాలతో పట్టి తెచ్చిన వాళ్ళకుగాని, లేక తల నరికి తెచ్చిన వాళ్ళకుగాని ఒక చిన్న సామంత రాజ్యం యివ్వబడుతుందని ప్రకటిద్దాం. నా ఊహ—వాడు అర్ధరాజ్యం దొరుకు



తుందన్న ఆశతో తప్పక మన ఆ స్థానానికి వస్తాడని. ఆ తరవాత వాణ్ణి రాకాసిలోయలో ఎలా వుపయోగ పెట్టుకోవాలో నేనూ, బ్రహ్మ దండీ నిర్ణయిస్తాం," అన్నాడు రాజగురువు.

అర్ధరాజ్యం యిస్తామని వేసే చాటింపు కేవలం కేశవుణ్ణి దొరక పుచ్చుకునేందుకు ఆడే నాటకమే అని తెలిసిం తరవాత రాజు గారు అందుకు అంగీకరించాడు. ఆ వెంటనే బ్రహ్మపుర రాజ్యంలోని పల్లెల్లో, పట్టణాల్లో రాజాజ్ఞ ప్రకారం చాటింపు వేయబడింది.

ఒకటీ రెండు రోజులు గడిచీ గడవక ముందే, ఈ చాటింపు వార్త కేశవుడికీ, అతడి ముసలి తండ్రికీ, జయమల్లుకూ తెలిసింది. నగరవాసులు కొండ ప్రాంతాల నుంచి వెళ్ళిపోగానే, వాళ్ళు ముగ్గురూ ఒక కొండ గుహలో చేరారు. ముందు కర్తవ్యాన్ని గురించి తర్జన భర్జనలు చేస్తున్నారు.

"ఇందులో ఏదో పెద్ద మోసం వున్నది!" అన్నాడు ముసలివాడు.

"అందుకు సందేహమా! కేశవుడు వెంట వుంటే తప్ప, ఆ రాకాసిలోయ లోని ధన రాసులు దొరకవు. అందుకు తగిన జాతకుడు కేశవుడే అని బ్రహ్మదండి, రాజగురువుకు చెప్పి వుంటాడు. అతడు మహా జిత్తుల మారి," అన్నాడు జయమల్లు.



"బహుశా, నన్ను కాళ్ళూ చేతులూ కట్టి, ఆ రాకాసిలోయకు మోసుకు పోవాలని వాళ్ళు పథకం వేసి వుంటారు. వాళ్ళ పని తీరిం తరవాత నన్ను తప్పక కొరత వేస్తారు," అన్నాడు కేశవుడు కోపంగా.

"ఆ ప్రమాదం యిప్పుడే ఎదురవ బోతున్నది. నీ తల విలువ అర్ధరాజ్యం; తెలిసిందా? కనక, మనం ఎంత త్వరగా, ఈ రాజ్యపు హద్దులు దాటిపోతే అంత మంచిది," అన్నాడు జయమల్లు.

"ఈ రూపంలో మన నెవరైనా గుర్తి స్తారు. ఈ సరికి ఈ చాటింపు వృత్తాంతం యితర రాజ్యాల వాళ్ళకూ్కడా తెలిసి





వుంటుంది. వాళ్ళు మాత్రం నన్ను గుర్తిస్తే బతకనిస్తారంటావా?" అన్నాడు కేశవుడు.

కేశవుడి ముసలి తండ్రి పొందిన ఆదుర్దా అంతా యింతా కాదు. అతడు గుహలో నుంచి బయిటికి వచ్చి, చుట్టూ కలయ చూసి, "డబ్బుకు ఆశ పడిన నగర వాసుల్లో కొందరైనా మళ్ళీ యిక్కడికి వచ్చి, కొండ గుహలూ, కోనలూ వెతికే ప్రమాదం వున్నది. మీరు యిక్కణ్ణించి వెంటనే పారిపొండి," అన్నాడు.

"ఈ వేషాలతో లాభం లేదు. దేశాటనకు బయలుదేరిన ఏ క్షత్రియ యువకుల వేషాలో వేసుకుని, వింధ్యారణ్యాల్లోకి పారి పోవలసిందే. అందుకు అవసరం అయిన ధనం బ్రహ్మదండి మాంత్రికుడి గుహలో ఎక్కడ దాచబడి వున్నదో నాకు తెలుసు!" అన్నాడు జయమల్లు.

"ఆ గుహను రాత్రింబగళ్ళు యిద్దరు సైనికులు కాపలా కాస్తున్నారు," అన్నాడు కేశవుడు. "ఆ యిద్దర్నీ మనం చంపి గుహ లోకి వెళ్ళలేమా?" అని ప్రశ్నించాడు జయమల్లు.

"సాధ్యమైనంత వరకు వాళ్లను చంప కుండానే గుహలోకి వెళ్ళవచ్చు. అంతా రహస్యంగా జరిగిపోవాలంటే, చీకటి పడేవరకూ వేచి వుండటం మంచిది," అన్నాడు ముసలివాడు. అందుకు కేశవుడూ, జయమల్లూ, సరేనన్నారు.

సూర్యాస్తమయమై బాగా చీకటి పడే వరకూ ముగ్గురూ వంతుల ప్రకారం తాము దాక్కుని వున్న గుహ ముందు కాపలా కాశారు. ఏ క్షణాన్నయినా, నగరవాసులు తమ గుహ కేసి రావచ్చునన్న భయం వాళ్లను చాలా బాధించింది. చీకటి పడి కొంచెం రాత్రి పొద్దు పోయిం తరవాత ముగ్గురూ, మాంత్రికుడి గుహకేసి బయలుదేరారు. రాళ్ళు చాటు చేసుకుని పిల్లుల్లా నిశ్శబ్దంగా గుహను సమీపించిన వాళ్ళను, గుహ



ముందు కాపలా వున్న సైనికుడు గుర్తించ లేదు. ముసలివాడు సైనికుడు నిలుచున్న చోటుకు దాపులలో వున్న రాయి చాటు నుంచి, కత్తి ముందుకు చాచి సైనికుడి వెన్నుకు దాన్ని ఆనిస్తూ, "అరవకు! రెండో వాడెక్కడ?" అని ప్రశ్నించాడు మెల్లిగా.

హఠాత్తుగా వెన్నును కత్తి మొన తాక గానే సైనికుడి పై ప్రాణాలు పైనే పోయినై. వాడు ఏమి చేయటమా అని ఆలో చించేంతలో కేశవుడూ, జయమల్లూ వాడి ముందుకు వచ్చి నిలబడి, "మా బందిపోట్ల నాయకుడు, మిమ్మల్నిద్దర్నీ చంపి, గుహలో వున్న ఒక వస్తువును తెమ్మన్నాడు. కాని, మాకు మిమ్మల్ని చంపాలని లేదు. మా పనేదో మేం చూసుకు పోతాం. నీ తోటి వాడెక్కడ?" అని అడిగారు.

సైనికుడు నిలువు గుడ్లువేసి, గుహకు ఒక పక్కగా గుర్రు పెట్టి నిద్రపోతున్న, అనుచరుణ్ణి చూపించాడు. మరుక్షణం కేశవుడూ, జయమల్లూ, ఆ నిద్రపోతున్న వాడి మీద పడి, వాడి కాళ్ళూ చేతులూ బంధించి ఒక మూల పడవేశారు.

"కత్తి నా వెన్నులో గుచ్చుకుంటున్నది. మీ బందిపోటు స్నేహితుణ్ణి కత్తి తీయ మనండి," అంటూ ప్రాధేయ పడ్డాడు



మొదటి సైనికుడు. కాని, ముసలివాణ్ణి సైనికులు గుర్తించటం ప్రమాదకరమని కేశవుడూ, జయమల్లూ ముందే నిశ్చయించు కున్నారు. తాము వింధ్యారణ్యాలు పట్టి పోయే వాళ్ళు, కాని ముసలివాడు ఈ ప్రాంతాలే ఎక్కడో ఒక చోట కొంతకాలం నివశించవలసి వుంటుంది.

"ఆ బందిపోటు వాడి ముఖం చూశా వంటే నువ్వు నిలువునా ప్రాణం వదులు తావు. వాడంత భయంకరుడు!" అంటూ కేశవుడూ, జయమల్లూ కలిసి సైనికుడి కాళ్ళూ చేతులూ కట్టి, కళ్ళకు గంతలు కూడా బిగించారు.

జయమల్లు గుహలో ప్రవేశించి, కొద్ది సేపటి తరవాత మశి కొట్టుకున్న దుస్తులతో బయటికి వచ్చాడు. అతడి చేతిలో ఒక సంచీ వున్నది. ఆ సంచీని అతడు అటూ యిటూ కదిలించేసరికి ఘల్లు ఘల్లుమన్న ధ్వని వినబడింది.

"ఈ సంచీ నిండా బంగారు నాణాలే. బ్రహ్మదండి మాంత్రికుడు ఎందర్నో మోస గించి కూడబెట్టిన ధనం యిది. దీనితో మనం క్షత్రియోచితమైన దుస్తులూ, ఆయుధాలూ కొనుక్కోవచ్చు. ఇక బయలు దేరుదాం," అన్నాడు జయమల్లు.

ముగ్గురూ తిరిగి తమ గుహకు వచ్చేశారు. తెల్లవారగానే ఆ బంగారంలో కొంత ఖర్చు పెట్టి, అవసరమైన సామగ్రి కొనుక్కు వచ్చేందుకు ముసలివాడు నగరానికి వెళతా నన్నాడు. నగరంలో తన నెవరూ గుర్తించ కుండా మారు వేషం వేసుకుంటానన్నాడు. కేశవుడూ, జయమల్లూ అంగీకరించారు.

గుహలోని రాళ్లచాటున తను రహస్యంగా దాచుకున్న బంగారాన్ని జయమల్లు వెతికి వెలికి తీస్తూండగా, అక్కడ బ్రహ్మపుర రాజుగారి రాచనగరులో నిద్రిస్తున్న బ్రహ్మ దండి మాంత్రికుడికి పీడ కలలు వచ్చినై. ఎవడో దొంగ ఒకడు, తన బంగారం వున్న సంచీని, పైకీ కిందికీ ఎగర వేస్తున్నట్టూ, అది ఘల్లు ఘల్లుమని గోల చేస్తున్నట్టూ వాడు కలగన్నాడు.

"దొంగ, దొంగ! బంగారం, నా బంగారం!" అంటూ బ్రహ్మదండి మంచం మీంచి కిందికి దూకి వాకిలి కేసి పరిగెత్త సాగాడు. అక్కడ కాపలా వున్న భటుడు, ఈటెను మాంత్రికుడి గుండెల కేసి గురి చేసి, "ఒక్కడుగు ముందుకు వేశావో, చంపేస్తాను!" అంటూ హెచ్చరించి, "రండి, రండి! బ్రహ్మదండి, పారిపోవాలని చూస్తు న్నాడు!" అంటూ తన తోటి కాపలా భటుల్ని కేక వేశాడు. —(ఇంకా వుంది)






# విధినిర్ణయం

పట్టువిడవని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే శ్మశానం కేసి మౌనంగా నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఈ రాత్రి నీవు పడే ఈ శ్రమ అంతా విధి నిర్ణయమని నాకు తోస్తోంది. ఎంత విడ్డూరమైనప్పటికీ విధి నిర్ణయం జరిగే తీరుతుంది గదా. ఇందుకు నిదర్శనంగా కశీబుడనే మ్లేచ్ఛ రాజకుమారుడి కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

పూర్వం సముద్రతీరాన ఒక మ్లేచ్ఛ రాజ్యం ఉండేది. దానికి కశీబుడనే వాడు రాజయాడు. అతను యువకుడు. సముద్రయానమంటే అతనికి చాలా ప్రీతి. సముద్రంలో అనేక దీవులు అతని పరిపాలన కింద ఉండేవి.

ఒకసారి అతనికి దీవులన్నీ చుట్టబెట్టి రావాలన్న కోరిక కలిగింది. అందుకుగాను

బేతాళ కథలు



పది నౌకలను ఆయత్తం చేయించాడు. నెల రోజులకు సరిపడే ఆహారపదార్థాలు వగైరా వాటిలో నింపాడు. నౌకలు కదిలాయి. ఇరవైరోజులపాటు సముద్రయానం నిర్విఘ్నంగా కొనసాగింది. ఆ తరవాత ఒక రాత్రి ప్రళయమైన ఝంఝామారుతం ప్రారంభమై తెల్లవారేదాకా వీచింది.

ఈ గాలి సమసిపోయి తెల్లవారే సరికి నౌకలు ఒక అపరిచితమైన దీవిని చేరుకున్నాయి. ప్రయాణీకులు అక్కడ దిగి భోజనాలు చేసి, తిరిగి ప్రయాణించారు. కాని వారికి ఎటు వెళ్ళాలో తెలియలేదు. ఇరవైరోజులు దిక్కు తెలియకుండా ప్రయాణించాక వారు గొప్ప ప్రమాదానికి గురి అయారు. వారి నౌకలు అయస్కాంత పర్వతం గల దీవికి సమీపంగా వచ్చాయి.

ఈ అయస్కాంత పర్వతం సమీపానికి వచ్చిన నౌకలు భగ్నమై తీరుతాయి. నౌకలలో ఉండే ప్రతి ఇనపవస్తువునూ పర్వతం ఆకర్షించేస్తుంది. పర్వతం నిండా ఇలాటి ఇనప వస్తువులున్నాయి. కశీబుడి నౌకలకు ఇదే గతి పట్టింది. అతని నౌకలన్నీ సముద్రంలోనే విచ్చిపోయాయి. నౌకలలో వాళ్ళందరూ సముద్రంపాలయారు. ఒక్క కశీబుడు మాత్రం అదృష్టవశాత్తూ ఓడ తాలూకు కొయ్యపలక ఒకటి పట్టుకుని దీవి కేసి ఈది, బడలికతోనూ అయాసంతోనూ ఇసకలో పడి నిద్రపోయాడు.

అప్పు డతనికి ఒక వింత కల వచ్చింది. ఆ కలలో అతను తాను నిలబడి ఉన్న చోట ఇసకలో తవ్వే సరికి గజం లోతున ఒక విల్లూ, బాణమూ దొరికాయి. అతను వాటిని తీసుకుని తల ఎత్తి చూస్తే అయస్కాంతపర్వత శిఖరంపైన ఒక ఎత్తయిన దిమ్మా, దానిమీద నిలబడిన ఒక యోధుడి విగ్రహమూ కనిపించాయి. అతను విల్లుతో బాణాన్ని ఎక్కుపెట్టి యోధుడి పాదాలకు గురిచేసి కొట్టేసరికి ఆ విగ్రహం కాస్తా

సముద్రంలోకి పడిపోయింది. తరవాత ఎవరో వింత వ్యక్తి ఒక తెప్పతో వచ్చాడు. తాను అతనితో మాట్లాడక ఆ తెప్పలో ఎక్కి కూచున్నాడు.

కశీబుడు ఈ కల నుంచి అకస్మాత్తుగా మేలుకుని తాను ఉన్నచోట ఇసక తవ్వి చూశాడు. నిజంగానే అతనికి ఒక విల్లూ, బాణమూ దొరికాయి. తల ఎత్తి చూస్తే కొండశిఖరాన యోధుడి విగ్రహం కనిపించింది. అతను బాణంతో ఆ విగ్రహాన్ని సముద్రంలోకి పడగొట్టాడు. తరవాత కొంత సేపటికి ఒక మనిషి ఒక తెప్ప వేసుకుని వచ్చాడు. కశీబుడు మాట్లాడక ఆ తెప్పలో ఎక్కి కూచున్నాడు. తెప్పవాడు తెప్పను సముద్రం మీదుగా తీసుకుపోసాగాడు.

ఈ ప్రయాణం చాలాసేపు సాగింది. అంతసేపూ కశీబుడు ఆ తెప్ప నడిపేవాడి కేసి ఆశ్చర్యంగా చూశాడు. ఎందుకంటే వాణ్ణి తాను అదివరకు ఎక్కడో చూశానని పించింది. ఎంత ఆలోచించినా సరిగా జ్ఞాపకం రాలేదు. ఇంతలో తెప్ప మరొక తీరాన్ని చేరవచ్చింది. ఆ సమయంలో కశీబుడికి, ఆ మనిషిని ఎక్కడో చూసినట్టుండటానికి కారణం తట్టింది: వాడు ముమ్మూర్తులా కొండమీది విగ్రహంలాగే ఉన్నాడు!



"అయ్యా, నీ వెవరవు? నీకూ, ఆ కొండ మీది విగ్రహానికీ ఏమిటి సంబంధం?" అని కశీబుడు మంచిగానే అడిగాడు. వెంటనే ఆ మనిషి తెడ్డు వెయ్యటం ఆపి, కశీబుణ్ణి అవలీలగా రెండు చేతులా ఎత్తి సముద్రంలోకి గిరవాటువేశాడు. కశీబుడు మళ్ళీ నీటిపైకి తేలి చూసేసరికి తెప్ప జాడలేదు.

తీరం అంతదూరాన కనిపిస్తూనే ఉన్నప్పటికీ అతను దాని దగ్గిరికి ఈదుకు పోయేసరికి చాలాసేపు పట్టింది. అప్పటికి చీకటి పడింది. అతను తన తడిబట్టలను విప్పి నేలపై ఆరవేసి అక్కడే నిద్రపోయాడు. అతను తిరిగి తెల్లవారి లేచి ఆరిన బట్టలు

ధరించి ఆ ప్రాంతమంతా కలయ తిరిగి, అది చాలా చిన్న దీవి అనీ, అక్కడ తాను తప్ప మరొక నరప్రాణి లేదనీ తెలుసుకున్నాడు.

"నేను సముద్రం నుంచి ప్రాణాలతో బయట పడింది, ఈ నిర్మానుష్యమైన దీవిలో దిక్కులేని చావు చావటానికేనా ?" అని అనుకుంటూ ఉండగా అతనికి సముద్రం మీద ఒక పడవ కనిపించింది. ఆ పడవ అతనున్న దీవి కేసే వస్తూ ఉండటం గ్రహించి కశీబుడు ఒక పెద్ద చెట్టు ఎక్కి ఆకు గుబుర్ల చాటున దాగి ఏమి జరుగుతుందో గమనించసాగాడు.

అతను చూస్తూండగానే పడవ తీరాన్ని చేరి లంగరు దించింది. పదిమంది పని వాళ్ళు పార తీసుకుని వచ్చి, దీవి మధ్య ఏవో గుర్తుల కోసం వెదికి, ఆ గుర్తులను బట్టి ఒకచోట తవ్వారు. కొంతసేపటికి తవ్వటం పూర్తి చేసి ఒక మూతరాయి పైకి తీశారు. తరవాత వారు పడవ వద్దకు తిరిగివెళ్ళి నెత్తి మీద తట్టలూ, మూటలూ పెట్టుకుని రొట్టెలూ, పళ్ళూ, బట్టలూ, ఇంకేవేవో పదార్థాలూ తీసుకు వచ్చి తాము తవ్విన కంతగుండా భూగర్భంలో చేర్చారు.

చిట్టచివరకు ఒక ధనికుడైన వృద్ధుడు ఒక పసికుర్రవాణ్ణి వెంటబెట్టుకుని వచ్చాడు.



ఆ కుర్రవాడు చూడటానికి ఎంతో అందంగా ఉన్నాడు. పాలుగారే వాడి ముఖం పూర్ణ చంద్రుడి లాగున్నది. వృద్ధుడు ఆ కుర్ర వాడితో సహా కంతలోకి దిగిపోయాడు. తర వాత ఆ వృద్ధుడు ఒక్కడే పైకి వచ్చి తన నౌకర్లకు ఏదో ఉత్తరు విచ్చాడు. నౌకర్లు మూతరాయిని యథాస్థానంలో ఉంచి, కంతను మట్టితో పూడ్చేసి పడవ వద్దకు వెళ్ళిపోయారు. పడవ సముద్రంమీద బయలుదేరి పోయింది.

తన కళ్ళ ఎదట జరిగిన ఈ అన్యాయం చూసి కశీబుడు మండిపడ్డాడు. ముక్కు పచ్చలారని ఆ పసివాణ్ణి మోసగించి ఈ నిర్జనమైన దీవికి తెచ్చి, వాణ్ణి ఇక్కడ సజీవంగా పూడ్చిపెట్టి వెళ్ళిపోయిన ఆ వృద్ధుణ్ణి అతను శపించాడు. ఆ కుర్ర వాడికి బతికే యోగం ఉండబట్టే ఇంత ఘోరం జరిగినప్పుడు తాను ఈ దీవిపై ఉండటం జరిగిందని అతను అనుకున్నాడు.

పడవ బయలుదేరగానే అతను చెట్టు దిగివచ్చి, పనివాళ్ళు కప్పిన మట్టిని ఎలాగో తొలగించాడు. మూతరాయి చాలా బరువుగా ఉండటంచేత దాన్ని ఎత్తడం చాలా కష్టమయింది. అయినప్పటికీ, లోపల సమాధి అయిన కుర్రవాడిపై జాలి కొద్దీ కశీబుడు లేనిశక్తి తెచ్చుకుని ఆ రాయి ఎత్తాడు.





దాని అడుగున అతను ఊహించినట్టే ఒక మాళిగ ఉన్నది. దానిని ఎవరో చాలా కాలం క్రితమే, సమస్త సౌకర్యాలతోనూ, సదుపాయాలతోనూ కట్టారు. దాని నిండా ఇప్పుడు కూలీలు తెచ్చిన వస్తువులు, ఎక్కడ ఉండవలసినవి అక్కడ, వీలుగా అమర్చి ఉన్నాయి. చీకటి లేకుండా దీపాలు వెలిగించి ఉన్నాయి.

చాలా విశాలంగా ఉన్న ఈ మాళిగ మధ్య కుర్రవాడు నిశ్చింతగా కూచుని ఉన్నాడు. కశీబుడి రాకకు కంగారుపడుతూ వాడు లేచి నిలబడ్డాడు. అది చూసి కశీబుడు, "భయపడకు, నాయనా! నిన్ను సజీవ సమాధి నుంచి రక్షించటానికే నేను వచ్చాను. దుర్మార్గుడైన ఆ ముసలివాడు నీకు మాయమాటలు చెప్పి నిన్ను చంపె య్యటానికి ఈ ఆర్భాటమంతా చేసినట్టు న్నాడు. కాని దేవుడి దయవల్ల నే నిదంతా గమనించటం జరిగింది," అన్నాడు.

ఈ మాటలు విని ఆ కుర్రవాడు పెద్దగా నవ్వి ఇలా చెప్పాడు :

"మీరు అపోహపడుతున్నారు. ఆ ముస లాయన దుర్మార్గుడు కాడు. ఆయనకు నేను లేకలేక కలిగిన కొడుకును. నే నాయనకు పంచప్రాణాలకన్న ఎక్కువ. నన్నాయన చంపటానికి ఇక్కడ ఉంచలేదు; చావు నుంచి కాపాడటానికే ఈ ప్రయత్నమంతా చేయించాడు. నేను పుట్టినప్పుడే నా కొక రాజు చేతిలో గండం ఉన్నదనీ, అయ స్కాంత పర్వతంపైన ఉండే విగ్రహం పడి పోయిన నలభై రోజులలోగా ఆ విగ్రహాన్ని పడగొట్టిన వాడే నన్ను చంపుతాడనీ దైవ జ్ఞులు చెప్పారు. అందుచేత నేను పసి కందుగా ఉండగానే నా తండ్రి ఈ నిర్జన మైన దీవిలో ఈ మాళిగ తయారుచేయించి పెట్టాడు. అయస్కాంత పర్వతం మీది విగ్రహం పడిపోయినట్టు తెలియగానే నన్ను ఇక్కడికి చేర్చారు. ఈ నలభై రోజులకూ

నాకు సరిపడే అన్ని వస్తువులూ ఇక్కడ ఉన్నాయి. ఆ తరవాత మా వాళ్ళు వచ్చి నన్ను తీసుకుపోతారు. ఈ నలభై రోజులూ ఒంటరిగా గడపాలే అన్న విచారం ఒకటే నన్ను బాధిస్తూ వచ్చింది. మీరు దైవికంగా వచ్చారు గనక ఆ బాధకూడా ఉండదు."

ఆ కుర్రవాడు చెప్పిన ఆ మాటలు విని కశీబుడు నివ్వెరపోయాడు. ఆ కుర్రవాడికి తన వల్ల ప్రాణాపాయం ఎలా వస్తుందో అతను ఊహించలేకపోయాడు. ఎందు కంటే వాణ్ణి చూసిన క్షణం నుంచీ అతనికి ఎలాటి వాత్సల్యం కలిగిందంటే వాడి ప్రాణానికి తన ప్రాణం బలి చెయ్యవలిసి వచ్చినా కశీబుడు సిద్ధంగా ఉన్నాడు. తాను ఫలానా అని ఆ కుర్రవాడికి చెప్పి వాడికి భయం కలిగించక, వాడి వాళ్ళు తిరిగివచ్చే దాకా వాడికి తోడుగా ఉండి, కబుర్లు చెప్పుతూ, సుఖంగా కాలక్షేపం జరిగేలాగ చూడటానికి నిశ్చయించాడు.

ఇద్దరికీ మధ్య గొప్ప స్నేహబంధం ఏర్ప డింది. ఆ మాళిగలో రకరకాల ఆహార పదార్థాలూ, మిఠాయిలూ, పళ్ళూ ఉన్నాయి. కబుర్లు చెప్పుకుంటూ, ఆకలివేసి నప్పుడు తింటూ, నిద్రవచ్చినప్పుడు నిద్రపోతూ వారు నలభై రోజులూ సుఖంగా వెళ్ళబుచ్చారు.



ఆఖరు రోజు రాత్రి కుర్రవాడు తనకు పళ్ళు తినాలని ఉన్నదన్నాడు. మంచానికి ఎగువగా గోడకు కత్తి వేళ్ళాడుతున్నది. దాన్ని తీద్దామని కశీబుడు మంచం మీద నిలబడి కత్తి తీసుకునే సమయాన అల్లరికి కుర్రవాడు కశీబుడి అరికాళ్ళలో కితకితలు పెట్టాడు. ఆ కితకితలు భరించలేక కశీ బుడు పడిపోయాడు. అతను అలాపడ టంలో అతని చేతి కత్తి సూటిగా కుర్రవాడి గుండెలో దిగబడి తక్షణమే కుర్రవాడు మరణించాడు.

తెల్లవారగానే ఆ కుర్రవాడి తండ్రి నౌక ర్లతో సహా వచ్చి చూస్తాడు. కశీబుడికి

అ చోటు విడిచి పారిపోవాలనిపించింది, కాని తనకు ఎంతో ప్రేమపాత్రుడైన కుర్రవాణ్ణి వదిలిపెట్టిపో బుద్ధికాలేదు. తెల్లవార్లూ కుర్రవాడి శవంపైన పడి ఏడిచి, చివరకు కశీబుడు ఆ మాళిగ నుంచి పైకివచ్చి, రాతి మూత యధాస్థానంలో ఉంచి, మట్టికప్పి మళ్ళీ వెళ్ళి చెట్టుచాటున దాక్కుని, కుర్రవాడి శవాన్ని వాళ్ళవాళ్ళు తీసుకుపోయాక తాను ఏదోవిధంగా ఆ దీవి నుంచి దాటిపోయాడు.

బేతాళు డీ కథ చెప్పి, "రాజా, కశీబుడు ఆ కుర్రవాడు తనకున్న ప్రాణగండం గురించి చెప్పినాక అక్కడి నుంచి తాను ఎందుకు వెళ్ళిపోలేదు? దైవజ్ఞులు చెప్పే జోస్యంలో నమ్మకంలేకనా? వాడిపై ప్రేమ చేతనా? లేక తాను వెళ్ళిపోతే వాడికి తన నుంచి చావు రాదేమోననా? ఈ సందేహానికి సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "మనిషికి ఎన్ని విశ్వాసాలున్నప్పటికీ అవి ఆత్మవిశ్వాసంతో సమంకావు. కశీబుడికి మొదట ఆ కుర్రవాణ్ణి చూసినప్పుడు జాలి కలిగింది. అది అతనితో మాట్లాడినాక వాత్సల్యంగా మారింది. తాను బుద్ధిపూర్వకంగా ఆ కుర్రవాణ్ణి ఒక్క పరుషమైన మాట కూడా అననే ధైర్యమూ, నమ్మకమూ ఉండబట్టే అతను ఆ కుర్రవాణ్ణి ఒంటరిగా విడిచి వెళ్ళిపోలేదు. తాను ఉండిపోవటం వల్ల కుర్రవాడికి చాలా ఆనందం చేకూర్చాడు. అతను వెళ్ళిపోకపోవటంలో తప్పేమీలేదు. ఎవడైనా విధివశాన తాను దుర్మార్గుడైపోతాడంటే చింతించాలి గాని, అనుకోకుండా తన చేత విధి చెడ్డ పని చేయిస్తే అందుకు చింతించ నవసరంలేదు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)



# చిన్ననాటి రుణం

హాన్ చక్రవర్తులలో ఒకడైన వూ అనేవాడికి ఒక దాది ఉండేది. ఈ దాది ఏదో నేరం చేసింది. చక్రవర్తి ఆమెను విచారణ జరిపి శిక్షించ నిశ్చయించాడు.

చక్రవర్తి వద్ద ఒక విదూషకు డుండేవాడు. ముసలిది అతని సలహా కోరింది. విదూషకు డామెతో, "శిక్ష తప్పించుకోవటం చాలా కష్టం. అయినా నేను చెప్పినట్టు చెయ్యి. విచారణ సమయంలో ఏమీ మాట్లాడకు. విచారణ ముగిసినాక నిన్ను శిక్షించటానికి భటులు పట్టుకుపోయేటప్పుడు మళ్ళీ మళ్ళీ వెనక్కు తిరిగి చక్రవర్తి కేసి చూడు. తరవాత ఏమవుతుందో చూద్దాం," అన్నాడు. ముసలిది అలాగే చేసింది. చక్రవర్తి ఆమెను విచారించి శిక్ష విధించాడు. శిక్షించటానికి భటులు తీసుకుపోయేటప్పుడు ఆమె మళ్లీ మళ్లీ చక్రవర్తి కేసి తిరిగి చూసింది. ఆమెను చూసి విదూషకుడు, "నీ కేమైనా పిచ్చా ఏమిటి? ఎప్పుడో చక్రవర్తిగారు పసి గుడ్డుగా ఉండగా నీ వాయనకు పాలిచ్చావని నీ ముఖం ఆయన కింకా జ్ఞాపకం ఉంటుందనుకున్నావా?" అన్నాడు.

ఈ మాటలు వింటూనే చక్రవర్తి అమె శిక్షను ఉపసంహరించాడు.





# యుక్తిపరుడు బీర్బల్

అక్బర్ చక్రవర్తి ఆస్థానంలో ఫైజీ, అబుల్ ఫజల్, రాజా మానసింహుడు, తోడర్‌మల్లు, గంగ కవి, తాన్సేను, బీర్బల్ మొదలైన విఖ్యాత పురుషులు ఎందరో ఉండేవారు. వారిలో బీర్బల్ యుక్తికీ చమత్కృతికీ ప్రసిద్ధి చెందిన వాడు. ఆయనను గురించి ఎన్నో కథలు చెబుతారు. వీటిలో కొన్ని కల్పితాలు కావచ్చు. అయినా అవి చెప్పు కోవటానికి చాలా రమ్యంగా ఉంటాయి.

ఒకసారి అక్బర్ బీర్బల్‌ను, "నిజానికీ అబద్ధానికీ మధ్య దూరం ఎంత?" అని అడిగాడట. బీర్బల్ తడువుకోకుండా, "నాలుగు అంగుళాలు," అని జవాబిచ్చా డట. అక్బర్ ఆశ్చర్యపోయి, "ఎలా చెప్ప గలవు?" అన్నాట్ట.

"మన కళ్లు ఎప్పుడూ నిజమే చూస్తాయి. మన బుర్రలోకి అబద్ధం ప్రవేశించాలంటే చెవుల ద్వారానే గదా ప్రవేశించాలి. చెవు లకూ కళ్ళకూ మధ్య ఉండే ఎడం నాలు గంగుళాలే గద," అన్నాడట బీర్బల్.

ఒకసారి అక్బర్ నిండు పేరోలగంలో, "నేను గొప్పవాణ్ణా? ఇంద్రుడు గొప్ప వాడా?" అని అడిగాడు.

ఈ ప్రశ్నకు సభికులు ఏ సమాధానమూ ఇవ్వలేక మథన పడ్డారు. ఇంద్రుడే ఎక్కు వంటే పాదుషాకు కోపం రావచ్చు. పాదు షాయే ఎక్కువంటే అక్బరు సంతోషించి ఊరుకోక, ఆ మాట రుజువు చెయ్యమం టాడు. ముందు గొయ్యి, వెనక నుయ్యి అయింది వారి గతి. అందుచేత వారు బీర్బల్ కేసి చూశారు.

బీర్బల్ ధైర్యంగా నిలబడి, "స్వర్గాన్ని ఏలే ఇంద్రుడి కన్న తమరే ఎక్కువ, సందేహం లేదు," అన్నాడు.

"ఆ మాట ఎలా రుజువు చేస్తావు?" అని అక్బర్ అడిగాడు.

వి. ఆదినారాయణరావు



"దేవుడు ఇంద్రుణ్ణీ, మిమ్మల్నీ సృష్టించి త్రాసులో పెట్టి తూచాడు. మీరున్న పళ్ళెం బరువై కిందికి దిగింది. ఇంద్రుడి పళ్ళెం తేలికై పైకి పోయింది. అందుచేత దేవుడు మిమ్మల్ని భూమికి చక్రవర్తిగా నియమించి, ఇంద్రుణ్ణి పైన ఉండే స్వర్గానికి రాజుగా చేశాడు," అన్నాడు బీర్బల్.

ఈ చమత్కృతికి అక్బర్‌తో బాటు సభికులందరూ ఎంతో ఆనందం పొందారు.

మరొకసారి కాలక్షేపానికి బీర్బల్‌తో పిచ్చాపాటీ చేస్తూ అక్బర్, "మన ఢిల్లీ నగరంలో ఎన్ని కాకులున్నాయో లెక్కలు వేయింతా మనుకుంటున్నాను. ఏమంటావు?" అన్నాడట.

వెంటనే బీర్బల్, "కాకుల జనాభా లెక్క అదివరకే నేను సేకరించాను. ఢిల్లీలో సరీగా అరవై వేల అయిదు వందల యాభై రెండు కాకులున్నాయి," అన్నాడట.

ఈ వేళాకోళానికి అక్బర్ కొద్దిగా అలిగి, "లెక్కవేయించి చూడనా?" అన్నాడట.

"కావలిస్తే వేయించి చూసుకోండి, కాని లాభం ఏమంత ఉండదు. ఎందుకంటే అనేక కాకులు పొరుగూళ్లలో ఉండే తమ బంధువులను చూడబోయి కాకుల సంఖ్య తరిగి ఉండవచ్చు. లేదా, పొరుగూళ్ళ నుంచి తమ బంధువులను చూడటానికి అనేక కాకులు వచ్చి సంఖ్య పెరిగికూడా ఉండవచ్చు," అన్నాడు బీర్బల్.

ఈ మాటకు అక్బర్ ఆగ్రహం మాని విరగబడి నవ్వాడట.

ఒక్కొక్కసారి బీర్బల్ చేత విచిత్రంగా మాట్లాడించటానికి అక్బర్ నోటికి వచ్చినది ఏదో ఒకటి అనేసేవాడు. అలాగే ఒకసారి ఆయన బీర్బల్‌తో, "ఇక నుంచీ నెలల ప్రమాణం రెట్టింపు చేద్దామనుకుంటున్నాను. నీ ఉద్దేశ మేమిటి?" అన్నాడు.

"అలాగే చేయించండి, అద్భుతంగా ఉంటుంది," అన్నాడు బీర్బల్.

"ఎందుచేతా?" అన్నాడు అక్బర్.

"చక్కగా వెన్నెల రాత్రులు రెట్టింపవు తాయి గద!" అన్నాడు బీర్బల్.

అక్బర్ ఆ విషయాన్ని అంతటితో పోనిచ్చాడు. ఇంకొకసారి అక్బర్ ఒంటరిగా ఏదో ఆలోచించుకుంటూ అభ్యంతర మంది రంలో ఉండగా ఏదో మాట్లాడాలని బీర్బల్ అక్కడికి వెళ్ళాడు.

"ఈ వేళప్పుడు ఇక్కడి కెందుకు వచ్చావు, బీర్బల్?" అన్నాడు అక్బర్ చిరాకుగా.

"తమతో ఒక ముఖ్య విషయం మాట్లా డాలి," అన్నాడు బీర్బల్.

"నా కిప్పుడు మాట్లాడే ఓపిక లేదు. రేపు చూద్దాం," అన్నాడు అక్బర్.

"మీరు మాట్లాడనే వద్దు. నేను మాట్లాడ తాను, మీరు వినండి," అన్నాడు బీర్బల్.

ఈ చమత్కారానికి అక్బర్ చిరాకంతా పోయింది. ఆయన బీర్బల్ చెప్పేది విని, అతని పని చూసి పంపేశాడు.

ఒకరోజు దర్బారులో అక్బర్ తన సభికులతో, "మీలో ఎవరైనా ఇక్కడ ఉన్న వారి మనసులో ఉండే ఆలోచనలు ఏమే మిటో ఊహించగలరా?" అని అడిగాడు.

ఎవరూ మాట్లాడలేదు. బీర్బల్ ఒక్కడే లేచి, "ఈ సభలో ఉన్నవారందరూ ఈ



క్షణాన ఏమనుకుంటున్నారో నేను చెప్ప గలను!" అన్నాడు.

"ఏమనుకుంటున్నారు?" అని అక్బర్ ఆశ్చర్యంగా అడిగాడు.

"పాదుషా వారి దివ్య పరిపాలన ఇలాగే కలకాలం సాగాలనుకుంటున్నారు. అలా అనుకోనివా రెవరన్నా ఉంటే ఆ సంగతి ఒప్పుకో మనండి, నేను పొరబడ్డానని ఒప్పు కుంటాను!" అన్నాడు బీర్బల్. అతని చమత్కారానికి అందరూ హర్షించారు.

బీర్బల్‌కు పుగాకు అలవాటుండేది. అది అక్బర్‌కు నచ్చేది కాదు. ఒక నాడు వారిద్దరూ రాజభవనం మిద్దె మీది నుంచి ప్రకృతిని చూసి ఆనందిస్తూ నిలబడ్డారు. దూరాన పుగాకు తోటా, దానికి కొంచెం ఎడంగా గడ్డి మేస్తూ గాడిదా కనిపించాయి.

"చూశావా, బీర్బల్? ఆఖరుకు గాడిద కూడా పుగాకు ముట్టదు," అన్నాడు అక్బర్.

"అవును, ప్రభూ! గాడిద వంటి బుద్ధి లేని జంతువుకు పుగాకు విలువ తెలియదు!" అన్నాడు బీర్బల్ అమాయికంగా.

ఒకనాడు బీర్బల్ అక్బర్ కోసం వచ్చే సరికి అక్బరూ, ఆయన భార్యా మామిడి పళ్ళు తింటున్నారు. అక్బర్ తాను తిన్న మామిడిపళ్ళ టెంకలూ, తొక్కలూ తన భార్య సమీపంలో పెడుతూ వచ్చాడు.





బీర్బల్‌ను చూడగానే అక్బర్ తన భార్యను ఉడికించటానికి, "బేగం ఎలాంటి తిండిపోతో చూశావా, బీర్బల్ ?" అంటూ ఆమె చెంత ఉన్న తొక్కలనూ, టెంక లనూ చూపాడు.

బీర్బల్ నవ్వి, "అవును, ప్రభూ. స్త్రీలు భర్తల అడుగు జాడలలో నడవటం ధర్మం గనక భర్తల దురలవాట్లు కొన్ని పట్టు బడటం సహజమేగదా !" అన్నాడు.

"నేను కూడా తిండిపోతు నంటావా ?" అన్నాడు అక్బర్, తన దగ్గిరలో ఒక్క తొక్కగాని, టెంకగాని లేక పోవటం ప్రదర్శిస్తూ.

"బేగం సాహేబావారు మామిడి పళ్ళ గుజ్జు మాత్రమే తిని తొక్కలూ, టెంకలూ విసర్జించారు. కాని ఏలినవారు వాటినికూడా తినేశారుగద ! తిండిపోతు తన మంటే ఎలా ఉంటుంది !" అన్నాడు బీర్బల్.

తన దెబ్బ తనకే తగిలినందుకు అక్బర్ మాట్లాడ లేదు గాని ఆయన భార్య హర్షంతో చప్పట్లు కొట్టింది.

ఢిల్లీలో లాడ్, కపూర్ అని ఇద్దరు గాయకు లుండేవారు. పాదుషా ఒక సారి వారి పాట వినటం తటస్థించింది. వారి పాటకు ఆయన తన్మయుడై ఎంతగానో మెచ్చుకుని బహుమతిగా వారి కొక ఏను గును ఇప్పించాడు.

అసలే పొట్ట గడవని ఆ గాయకులకు ఈ ఏనుగును ఎలా మేపాలో తెలియలేదు. పాదుషా వారి కానుక ! వద్దనటానికి లేదు, అమ్మటానికి లేదు, ఇంకొకరికి ఇవ్వటానికి కూడా లేదు—ప్రభువుకు అపచారం! అందు చేత వారు తమ సంపాదన యావత్తూ ధార పోసి ఆ ఏనుగును కొంత కాలం పోషించి బిచ్చమెత్తుకునే దశకు వచ్చారు.

లాడ్ అనే వాడు కాస్త గడుసువాడు. అతనికి ఒక ఉపాయం తట్టింది. దాన్ని కపూర్‌కు చెప్పాడు. ఇద్దరూ కలిసి ఆ ఏనుగు

వీపున ఒక డోలూ, ఒక తంత్రీ వాద్యమూ కట్టి నగరం మీదికి వదిలేశారు. అది విచ్చల విడిగా వీధుల వెంట తిరుగుతూ జనాన్ని కంగారు పెట్టేసింది.

ఎవరో ఏనుగును నగరం మీదికి స్వేచ్ఛగా వదిలేశారన్న ఫిర్యాదు అక్బర్‌కు వెళ్ళింది. దాన్నిగురించి ఆరాతీయగా అది తాను గాయకులకు కానుకగా ఇచ్చిన ఏనుగే నని తెలియవచ్చింది. ఆయన లాడ్‌నూ, కపూర్‌నూ తన సమక్షానికి పిలిపించుకుని, "నేను మీకు కానుకగా ఇచ్చిన ఏనుగును నగరం మీద వదలటంలో మీ ఉద్దేశ మేమిటి?" అని అడిగాడు.

"ప్రభూ! మేము ఏడాదిపాటు ఈ ఏనుగును పోషించి దానికి పూర్తిగా మా విద్య యావత్తూ నేర్పాం. దానికి పరిపూర్ణ పాండిత్యం పచ్చింది గనక ఇక దాని పొట్ట అది పోసుకో గలుగుతుందన్న నమ్మకంతో వదిలిపెట్టాం. మా పాండిత్యంతో మా పొట్టలు మేము నింపుకుంటూ దాన్ని పోషించినట్టే అదికూడా తన పొట్ట తాను నింపుకుని మాకు తృణమో పణమో ఇస్తుం దనికూడా ఆశ పడుతున్నాం!" అన్నారు గాయకులు.

అక్బరు తాను చేసిన తప్పు గ్రహించి, వారి పాట్లు అర్థం చేసుకుని, వారి కొక



గ్రామం మాన్యంగా ఇచ్చాడు. అదిమొదలు వారు పాదుషా ఆదరణకు పాత్రులౌతూ సుఖంగా జీవనం సాగించారు.

కాని కొంత కాలం గడిచాక పాదుషాకు వారిపై ఎందుకో ఆగ్రహం వచ్చి వారికి దేశ బహిష్కార శిక్ష విధించాడు. కాని వారు ఎక్కడికి పోగలరు? వారు పగలల్లా ఢిల్లీ వెలపల ఉండే అరణ్యంలో గడుపుతూ, రాత్రిపూట నగరంలోకి వచ్చేవాళ్ళు.

ఆరు నెలలు గడిచాక వారికి ప్రాణం కడబట్టింది. తమ సమస్య పరిష్కరించ గలవాడు బీర్బల్ ఒకడే ననుకుని వారు ఒక రాత్రి బీర్బల్ ఇంటికి రహస్యంగా వచ్చారు. బీర్బల్ వారికి ఒక ఉపాయం చెప్పి పంపేశాడు.

మర్నాడు ఉదయం అక్బరు వాహ్యాళికి వచ్చే ప్రాంతానికి వారిద్దరూ వెళ్ళి, పాదుషాను చూడగానే చప్పున సమీపంలో ఉన్న చెట్టు ఎక్కారు.

అక్బరు వారిని గుర్తుపట్టి, "మిమ్మల్ని నా దేశం విడిచి పొమ్మంటినే? ఇంకా ఢిల్లీలో ఎందుకున్నారు?" అని అడిగాడు.

"ప్రభూ, మమ్మల్ని ఏం చెయ్యమన్నారు? మీరు చెప్పిన రోజే బయలుదేరి వెళ్ళాం. ఎంత దూరం పోయినా మీ రాజ్య సరిహద్దు రాలేదు. మీ రాజ్యం భూమి అంతా ఆక్రమించుకున్నదాయె. అందుచేత ఇలా కాదనుకుని, మీ రాజ్యం విడిచి పైకి వెళ్ళి పోదా మనే ఉద్దేశంతో చెట్లెక్కాం!" అన్నారు గాయకులు. అక్బరు కోపం ఈ మాటలతో పోయింది. ఆయన వారిద్దరినీ చెట్టు దిగి రమ్మని, "మీ కీ ఆలోచన చెప్పినది బీర్బల్ కాదూ?" అని అడిగాడు.

"చిత్తం! చిత్తం!" అన్నారు వారు.

"రేపటి నుంచీ మామూలుగా సభకు వస్తూ ఉండండి," అన్నాడు అక్బరు.

[వచ్చే సంచికలో మరి కొన్ని బీర్బల్ కథలు]





# భూతాలు చేసిన పెళ్ళి

## 3

కొంతక్రమాన షమ్సు బస్రా చేరుతూనే సుల్తాను వద్దకు వెళ్ళి తన అధికార పత్రాలు చూపాడు. నూర్ అల్దీన్ తన వజీరుగా ఉండే వాడనీ, అతను చనిపోయి పదిహేనే ళ్ళయిందనీ, అతని భార్య తన వెనకటి వజీరు కుమార్తె అనీ, ఆమె ఇంకా బస్రా లోనే ఉన్నదనీ సుల్తాను షమ్సుకు చెప్పాడు.

షమ్సు వెంటనే నూర్ భార్య వద్దకు వెళ్ళాడు. భర్త చనిపోయి, కొడుకు దేశాలు పట్టిపోయి, అతని జాడ తెలియక శోక సముద్రంలో మునిగి ఉన్న ఆమెకు షమ్సు తన కుమార్తె పెళ్ళి వృత్తాంతం చెప్పి, "మీ కొడుకు దైవికంగా నాకు అల్లుడై అంతలోనే జాడ తెలియకుండా ఎటో వెళ్ళి పోయాడు. వాడి చిహ్నంగా నా కూతురు ఒక పిల్లవాణ్ణి కన్నది. నాకు లాగే మీకు కూడా వాడు మనవడు. వాడికి అజీబ్ అని పేరుపెట్టుకున్నాం. వాణ్ణి కూడా నా వెంట తెచ్చాను," అన్నాడు.

నూర్ భార్య ఈ మాటలను వింటూనే కొంత చైతన్యం పొందింది. ఇంటి నుంచి వెళ్ళిపోయాక తన కొడుకు కొంత కాలమైనా బతికి ఉండి, ఒక కొడుకును కూడా కన్నందుకు ఆమె సంతోషించింది. అజీబ్‌ను తన ఇంటికి పిలిపించి, వాణ్ణి కౌగలించుకుని ఆనందాశ్రువులు రాల్చింది.

"ఇకనైనా మన మంతా ఒక చోటే ఉందాం. మీరు కూడా మా వెంట కైరోకు రాకూడదా?" అన్నాడు షమ్సు.

ఈ మాట వినటమే తడవుగా నూర్ భార్య తన సొత్తంతా పోగు చేసుకుని, ప్రయాణానికి అవసరమైనవన్నీ సమకూర్చుకుని, తన పరివారంతో సహా ప్రయాణానికి సిద్ధమయింది.

సి. మాధవరావు



షమ్సు బస్రా సుల్తాను వద్దకు వెళ్ళి సెల వడిగాడు. సుల్తాను షమ్సుకు అనేక కానుకలు ఇవ్వటమేగాక, ఈజిప్టు సుల్తాను గారి కివ్వమని ఎన్నో కానుకలు షమ్సు కిచ్చాడు. తరవాత షమ్సు తన మనవణ్ణీ, ఇద్దరు ఆడవాళ్ళనూ వెంట బెట్టుకుని కైరోకు తిరుగు ప్రయాణం కట్టాడు.

ఈ తిరుగు ప్రయాణంలో వారు వెనకటి లాగే డమాస్కస్ నగరం వెలపలి మైదానం మీద డేరాలు దించారు. నగరపు వర్తకులూ, ఇతర ప్రముఖులూ తన తాతగారి దర్శనానికి వచ్చి ఉన్న సమయంలో అజీబ్ సయ్యిద్‌తో, "బాబా, మనం ఒకసారి ఊళ్ళోకి వెళ్ళి వద్దామా? ఆ నాడు నేను రాయిపెట్టి కొట్టానే ఆ మిఠాయి దుకాణం వాడు ఎలా ఉన్నాడో, పాపం, కను క్కుందాం!" అన్నాడు.

ఇద్దరూ కలిసి మళ్ళీ హసన్ దుకాణానికి వచ్చారు. హసన్ ముఖాన గాయం మచ్చ ఉండటం అజీబ్ చూశాడు. అతను గొంతెత్తి హసన్‌తో, "నేను జ్ఞాపకం ఉన్నానా? నీ క్షేమం తెలుసుకుందామనే నిన్ను వెతు క్కుంటూ వచ్చాను," అన్నాడు.

హసన్ తల ఎత్తి చూసి, శరీరమంతా పులకలెత్తుతూ, "రండి, రండి! దయ చేయండి. నా వంటకాలు రుచి చూడండి. అబ్బాయిగారూ, మిమ్మల్ని చూసినప్పటి నుంచీ నా గుండె గుబగుబ లాడుతున్నది. కాని నే నా రోజు మీ వెంట రావటం పెద్ద తప్పు!" అన్నాడు.

ఈ రోజుకూడా అజీబ్, సయ్యిద్, హసన్ దుకాణంలో దానిమ్మ మురబ్బా తిన్నారు. తినటంలో అలా ఇలా కాకుండా కుతికల దాకా తిన్నారు. తినటం అయినాక హసన్ వారిచేత కస్తూరి గులాబీ పరిమళం గల షర్బతు తాగించాడు.

అప్పటికి సూర్యాస్తమయం కావచ్చింది. వాళ్ళిద్దరూ హసన్ వద్ద సెలవు పుచ్చుకుని

చకచకా నడుస్తూ కొద్దిసేపట్లో తమ శిబిరం చేరుకున్నారు.

నూర్ భార్య తన మనవణ్ణి చూడగానే, "ఇంతసేపు ఎక్కడికి వెళ్ళావు, బాబూ? ఎప్పుడనగా తిన్నావో, ఆకలివేస్తూ ఉండి ఉంటుంది. తినటానికి పెడతాను కూచో! నువ్వు కూడా కూచో సయ్యద్," అంటూ లోపలికి వెళ్ళి పింగాణీ గిన్నెలలో దానిమ్మ మురబ్బా—తాను స్వయంగా కనిపెట్టిన ప్రసిద్ధమైన దినుసు—తెచ్చి వారి ఇద్దరి ముందు పెట్టింది.



"తినటమే! ఊహుఁ, నా వల్ల కాదు," అన్నాడు సయ్యద్.

అజీబ్ తినేవాడిలాగా కొంచెం మురబ్బా నోట్లో పెట్టుకున్నాడు గాని మింగలేక పోయాడు. అతను ఆముదం తాగిన వాడిలా మొహంపెట్టి, "వద్దు, ఇదేమీ బాగా లేదు, బామ్మా!" అన్నాడు.

"ఓరీ, నా వంటకే తప్పు పట్టావుగా! పిండివంటలూ, మిఠాయీ నా లాగా చెయ్య గలవా డెవడున్నాడురా? చేస్తే మీ నాన్న చెయ్యాలి. కాని వాడికి నేనేగా నేర్పానూ?" అన్నది నూర్ భార్య పౌరుషంగా.

"లేదులే, బామ్మా. ఇలాటి మురబ్బాయే ఇంతకు ముందు ఒక మిఠాయి దుకాణంలో తిన్నాం. మళ్ళీ తాతతోనూ, మా అమ్మతోనూ చెప్పకు. ఆ దుకాణం వాడు చాలా బాగా చేశాడు. దాని వాసన ఏం వాసన! దాని రుచి ఏం రుచి! ఇది దానిముందు ఎందుకూ పనికి రాదు, బామ్మా!" అన్నాడు అజీబ్.

నూర్ భార్య ఆగ్రహంతో సయ్యద్ కేసి తిరిగి, "వెధవా, కుర్రాణ్ణి అడ్డమైన మిఠాయి దుకాణాలలోనూ తినిపించి పాడు చేస్తున్నావా?" అన్నది.

"మేం దుకాణం పక్కగా వెళ్ళాంగాని, లోపలికి పోనే లేదు, దొరసానిగారూ!" అన్నాడు సయ్యద్.

"లోపలికి వెళ్ళి తిన్నాంలే, బామ్మా!" అన్నాడు అజీబ్.

విషయం వజీరు షమ్సదాకా వెళ్ళింది. ఆయన స్వయంగా అడిగినాకూడా సయ్యద్, "మేమా దుకాణంలోకి వెళ్ళి తినలేదు," అని అబద్ధ మాడాడు.

"అలా అయితే ఈ మురబ్బా అంతా నేను చూస్తుండగా తిను," అన్నాడు షమ్స.

సయ్యద్ కళ్ళు తేలవేసి, తాను మిఠాయి దుకాణంలో కుతికల దాకా మురబ్బా తిన్నాననీ, అలాటి వంటకం తన జన్మలో ఎన్నడూ తినలేదనీ, దాని ముందు ఈ మురబ్బా దిగదుడుపేననీ ఒప్పుకున్నాడు.

ఈ మాటలు విని షమ్స విరగబడి నవ్వాడు. నూర్ భార్య మాత్రం అవమానం పొందిన ఆగ్రహంతో, "వెధవా, ఆ దుకాణానికి వెళ్ళి నువు తిన్న మురబ్బా కొనుక్కు రా. అది దీనికన్న ఎలా బాగుంటుందో చూస్తాను," అన్నది.

సయ్యద్ హసన్ దుకాణానికి వెళ్ళి, "నీ మురబ్బాతో పెద్ద చిక్కే వచ్చింది. అది రుచి చూస్తారట కాస్త అమ్ము. అద్భుతంగా ఉండాలి సుమా. లేకపోతే నా వీపు పెట్లి పోతుంది," అన్నాడు.

హసన్ ఒక పింగాణీ పాత్రలో మురబ్బా పెట్టి ఇస్తూ, "ఆ భయం నీ కేమీ వద్దు.



ఈ మురబ్బా నా కన్న బాగా చెయ్యగల వాళ్ళు ప్రపంచంలో ఎవరూ లేరు. చేస్తే మా అమ్మ చెయ్యాలి. ఆవిడ ఎక్కడో దూరదేశంలో ఉన్నది!" అన్నాడు.

సయ్యద్ తెచ్చిన మురబ్బా రుచి చూస్తూనే నూర్ భార్య, "ఇది చేసినవాడు నా కొడుకే! ఇలా చెయ్యటం ఇంకెవరివల్లా కాదు!" అన్నది ఆవేశంతో.

ఈ మాట వినగానే షమ్సు ఆలోచనలు శరవేగంతో కదిలాయి. ఈ మిఠాయి దుకాణంవాడు తన అల్లుడే కావచ్చు, కాక పోవచ్చు. నూర్ కొడుకు హసన్‌ను తాను ఎన్నడూ చూడలేదు. వాణ్ణి తన కూతురు గాని, వాడి తల్లిగాని చూసి చాలా ఏళ్ళ యింది. అందుచేత మనిషిని చూసి గుర్తించటం చాలదు. వాడికి సరి అయిన పరీక్ష పెట్టాలి. అదికూడా ఇక్కడ సాధ్యం కాదు. వాణ్ణి కైరోకు తీసుకు పోవాలి. ఇందుకుగాను షమ్సు ఆలోచించి ఒక పెద్ద పథకం వేశాడు.

ఆయన వెంటనే డమాస్కస్ రాజప్రతినిధి దగ్గిరికి వెళ్ళి తన సుల్తాను ఇచ్చిన అధికార పత్రాలు చూపాడు. రాజప్రతినిధి షమ్సుకు తగిన మర్యాదలన్నీ చేసి, "తమకు నా వల్ల కావలిసిన పని ఏమైనా ఉంటే సెలవియ్యండి," అన్నాడు.



"ఈ ఊళ్ళో ఉండే ఒక మిఠాయి దుకాణం వాణ్ణి కైరోకు బందీగా పట్టుకు పోదలిచాను. మీ తోడ్పాటు అవసరం," అన్నాడు షమ్స్.

"అదెంత పని?" అంటూ రాజ ప్రతినిధి కొందరు సాయుధ భటులను షమ్స్‌కు అప్పగించాడు. ఆయన ఆ భటులనూ, తన మనుషులనూ హసన్ దుకాణానికి పంపుతూ, "ఆ దుకాణం వాణ్ణి పెడరెక్కలు విరిచి కట్టి నా డేరాకు తీసుకురండి. వాణ్ణి మాత్రం ఏ పరిస్థితుల్లోనూ కొట్టవద్దు," అని హెచ్చరించాడు. కొద్దిసేపట్లోనే భటులు వెళ్ళి హసన్‌ను కట్టి తెచ్చి షమ్స్ ముందర పెట్టారు. హసన్ కంగారు పడుతూ, "అయ్యా, నా వల్ల ఏం నేరం జరిగింది?" అని అడిగాడు.

"ఆ మురబ్బా చేసింది నువు కాదా?" అని అడిగాడు షమ్స్.

"అవును, అందుకని నన్ను ఉరి తీస్తారా ఏమిటి?" అన్నాడు హసన్.

"ఉరి తీయటంతో పోతుందనుకున్నావా?" అంటూ షమ్స్ ఒక పెద్ద కొయ్య పెట్టె తెప్పించి, అందులో హసన్‌ను పెట్టి తాళం వేయించాడు. ఆ పెట్టెను ఒక ఒంటె మీద ఎక్కించారు. అప్పుడే షమ్స్ గుడారాలు ఎత్తి కైరోకు బయలుదేరాడు. దారి పొడుగునా తాము భోజనానికి విడిసి



నప్పుడల్లా షమ్స్ హసన్‌ను కొయ్య పెట్టెలో నుంచి పైకి తీయించి అతనికికూడా భోజనం పెట్టిస్తూ వచ్చాడు.

ఒకసారి హసన్ షమ్స్‌తో, "ఇదేమీ నా కర్థం కావటంలేదు. ఇంతకూ, నన్నేం చెయ్యబోతున్నారు?" అని అడిగాడు.

"నిన్నా, సిలువ వెయ్యబోతున్నాను," అన్నాడు షమ్స్.

"ఏ నేరానికి?" అని హసన్ మళ్ళీ అడిగాడు.

"మురబ్బాలో మిరియాల పొడి తక్కువ వేసినందుకు!" అన్నాడు షమ్స్. హసన్ నేల కేసి చూస్తూ మౌనంగా ఉండి పోవటం చూసి ఆయన, "ఏమిటాలోచిస్తున్నావు?" అని అడిగాడు.

"ఏమీ లేదు. ప్రపంచంలో వెర్రి ముండా కొడుకులు చాలామంది ఉన్నారుగాని, నిన్ను మించగలవాడుండటం అసంభవం. సిలువ వెయ్యాలిసింది నిన్నే!" అన్నాడు హసన్.

ఆ రాత్రే షమ్స్ సపరివారంగా కైరో ప్రవేశించాడు. అతని పెట్టెను సిత్తల్ పెళ్ళి జరిగిన హాలులో పెట్టించాడు షమ్స్. పడక గదిని ఆ నాడు ఎలా ఉన్నదో అచ్చగా అలాగే అమర్చాడు. ఎక్కడ ఉండవలిసిన వస్తువులు అక్కడ పెట్టించాడు. తన కుమార్తె చేత పెళ్ళికూతురి వేషం వేయిం



చాడు. నిద్రలో ఉన్న హసన్‌ను పెట్టెలో నుంచి తీయించి, అతనికికూడా పెళ్ళినాటి దుస్తులు తొడిగించి నడవలో పడుకో బెట్టించాడు.

ఒక రాత్రివేళ హసన్ నిద్రలేచి కొత్త చోట ఉన్నందుకు ఆశ్చర్యపోయాడు. ఆ ప్రదేశం తాను ఎన్నడో కలలో చూసి నట్టుగా ఉన్నది. అతను లేచి నడుచు కుంటూ పడక గదిలోకి వెళ్ళి మరింత ఆశ్చర్యపోయాడు. తన దుస్తులూ, తల పాగా, డబ్బు సంచీతో సహా తాను పెట్టిన చోటే ఉన్నాయి. అతను వాటిని పట్టుకు చూసుకుని తనవేనని రూఢి చేసుకున్నాడు. డమాస్కస్‌లో తాను గడిపిన పదిహేనేళ్ళ జీవితమూ, తనను ఒక కుర్రవాడు చూడ రావటమూ, వాడు తన దుకాణంలో మురబ్బా తినటమూ—అంతా నిజం కావేమో ననుకున్నాడు. నుదురు తడివి చూసుకుంటే గాయం మచ్చ చేతికి తగి లింది. కల కాదు, తాను డమాస్కస్‌లో ఒక మిఠాయి దుకాణంవాడికి పెంపుడైన మాట నిజం. ఇదే కల అయి ఉండవచ్చు.

"ఇంతసేపు ఎక్కడికి వెళ్ళారూ?" అని సిత్తల్ హసన్ కంఠం ప్రశ్నించటం వినిపించింది. నాలుగడుగులు ముందుకు వెయ్యగానే అతనికి తన పెళ్ళినాటి స్త్రీ కని పించింది. హసన్ ఒక్క కేక పెట్టి మూర్ఛ పోయాడు. షమ్స హసన్ ప్రవర్తన యావత్తూ చాటునుంచి గమనిస్తూనే ఉన్నాడు. ఆయన అనుమానాలన్నీ తీరిపోయాయి. ఇతనే హసన్ బద్రద్దీన్; తన అల్లుడు; నూర్ కుమారుడు!

తరవాత హసన్ జరిగినదంతా తెలుసు కున్నాడు. అతని కష్టాలు గట్టెక్కాయి. ఏ తప్పూ చెయ్యకుండానే అతను అష్ట కష్టాలూ పడి చిట్ట చివరకు తన తల్లినీ, భార్యనూ, కొడుకునూ చేరుకుని సుఖంగా జీవించాడు.








# అసత్యవాది

చాలా కాలానికి తాతయ్యా తిరిగి వచ్చాడు. "తాతయ్యొచ్చాడు!" "ఇంత కాలం ఎక్కడ తిరిగావు, తాతయ్యా?" అంటూ పిల్లలు ఆయన చుట్టూ మూగారు.

"నువ్వు వెళ్ళాక మాకు కథలే లేవు, తాతయ్యా?" అని ఒకరూ, "మళ్ళీ కథలు చెబుతావా, తాతయ్యా?" అని ఒకరూ ఆయనను పీడించారు.

"కాస్త స్నానమూ, పానమూ చేసి రానివ్వండర్రా, కబుర్లు చెప్పుకోవచ్చు!" అన్నాడు తాతయ్య.

తాతయ్య స్నానం చేసి వచ్చే సరికల్లా వాలు కుర్చీ సిద్ధంగా వేసి ఉంచి పిల్లలు చుట్టూ కూచున్నారు.

తాతయ్య పొడుంకాయ ఒక కుర్రాడు గుప్పిట్లో గట్టిగా పట్టుకున్నాడు.

తాతయ్య వచ్చి కుర్చీలో కూర్చుని తన పొడుం కాయ కోసం వెతుక్కున్నాడు.

"పొడుం కాయేనా, తాతయ్యా? ఇదుగో! శ్లోకం చదువు ఇస్తాం!" అన్నారు పిల్లలు.

"మీ మొహం శ్లోకం. ఏదీ నేను చదివిన శ్లోకం ఒక్కటైనా మీకు జ్ఞాపకం ఉన్నదీ?"

"శ్లోకాలు జ్ఞాపకం లేకపోయినా నువ్వు చెప్పిన కథలు జ్ఞాపకం ఉన్నాయి, తాతయ్యా!!' అన్నాడొక కుర్రాడు.

"అసలు నువ్వు వెళ్ళాక మేం కథలే వినలేదు, తాతయ్యా!" అన్నాడు మరొకడు.

తాతయ్య తన పొడుంకాయి చప్పున లాగేసుకుని ఒక పట్టు పడుతూ, "ఒరేయ్, అబద్ధ మాడినా అతికినట్టుండాలి, అన్న సామెత మీ రెప్పుడన్నా విన్నారూ? ఆ మూల అన్ని చందమామలున్నాయే, మీకు కథలే లేవంటే నమ్ముతానుట్రా?" అన్నాడు.

"లేదులే, తాతయ్యా! నువ్వు చెప్పే కథలు కూడా మాకు కావాలి," అన్నాడు అబద్ధ మాడినవాడు.

"అయితే మాకు నువ్వేక కథలు చెప్పవా, తాతయ్యా?" అన్నారు మిగిలిన వాళ్ళు దిగులుగా.

"చెబుతానర్రా, కొంచెం ఓపికపట్టండి! నేనా సామెత ఎందుకు చెప్పాననుకున్నారూ? మీకు కథ చెప్పటానికే! అబద్ధమాడినా అతికినట్టుండాలి—అదీ సామెత. దానికి కథ వినండి," అంటూ తాతయ్య అరంభించాడు:

ఒక ఊళ్ళో ఒక రాజుగా రుండేవారట. అయన దగ్గిర మామూలుగా ఉండే అధికార్లలో ఒకడు సత్యవాది అనీ, ఇంకోడు అసత్యవాది అనీ ఉండేవారట. సత్యవాది నిజమైన విషయాలే రాజుగారికి చెప్పి కాలక్షేపం చేసేవాడు. అసత్యవాది ఉన్నాడు చూశారూ? వాడు మాత్రం అన్నీ అబద్ధాలు కల్పించి చెప్పి రాజుగారికి కాలక్షేపం చేస్తూ ఉండేవాడు.

అయితే రాజుగారు అసత్యవాదికి హెచ్చు జీతం ఇచ్చేవాడు, సత్యవాదికి కొద్ది జీతమే ఇచ్చేవాడు. అందుచేత అసత్యవాది గొప్పగా మేడలూ మిద్దెలూ కట్టించేసి, నౌకర్లతో, చాకర్లతో మహా వైభవంగా ఉండేవాడు. సత్యవాది తెచ్చేది మాత్రం అతడికీ అతడి భార్యకీ చాలీ చాలకుండా ఉండేది.




ఇలా ఉండగా ఒకనాడు సత్యవాదితో అతగాడి భార్య అన్నది గదా—"మీరు రోజూ రాజుగారికి ఉన్నదున్నట్టు చెబుతా రాయె. లేనిపోని వన్నీ కల్పించి చెప్పే అసత్యవాదికి రాజుగారు పెద్ద జీతం ఇస్తున్నాడాయె. పోనీ ఆ అసత్యవాది ఉద్యోగం మీరే చెయ్యగూడదా? సుఖపడిపోతాం!" అన్నది.

ఆ మాట విని సత్యవాది రాజుగారి దగ్గిరికి వెళ్ళి, "మహారాజా, నేనిన్నాళ్ళూ సత్యవాదిగా తమ వద్ద కొలువున్నాను గదా, నాకు కొంతకాలంపాటు అసత్యవాదిగా కొలువిప్పించగూడదా?" అని ప్రాధేయపడ్డాడు.



సత్యవాది ఏదో ఒక అబద్ధం చెప్పాలిగా? అందుకని ఆయన, "మరేమీ లేదు, మహారాజా! తమరు విన్నారో లేదో, నిన్న సాయంకాలంవేళ ఒక మనిషి నదిలో పడి కాలి చనిపోయాట్టా!" అన్నాడు.

"నీటిలో పడ్డ మనిషి మునిగి చస్తాడు గాని కాలి ఎలా చస్తాడయ్యా? ఏం జరిగిందేమిటి?" అని రాజుగారు అడిగాడు.

సత్యవాది తెల్ల మొహం వేశాడు. అబద్ధమైతే ఆడాడు గాని దాన్ని ఎలా సమర్థించాలో తెలియలేదు. రాజుగారు పాత అసత్యవాది కేసి తిరిగి, "అ నీళ్ళలో పడ్డ మనిషి కాలి ఎలా చచ్చిపోయాడో నీకేమన్నా తెలుసుటయ్యా?" అన్నాడు.

"తెలీకేం, మహారాజా? ఆ మనిషి ఒక పడవ నిండా గోతాలలో కాల్చిన సున్నపు రాయి వేసుకుని వాటి మధ్య కూచుని నదిలో ప్రయాణం చేస్తున్నాడట. మధ్యలో పడవ కాస్తా మునిగింది. సున్నపురాయి నీరు తగలగానే కుతకుతా ఉడికి సెగలు కక్కింది. ఆ సెగలకు ఆ మనిషి కాస్తా మాడి చచ్చాడు. అంతకన్న మరేమీలేదు, మహారాజా!" అన్నాడు పాత అసత్యవాది.

"అదా సంగతి? ఇంకేమిటయ్యా విశేషాలూ?" అని రాజు సత్యవాదిని మళ్ళీ

అప్పుడు రాజేంచేశాడూ, "ఈ పిచ్చి బ్రాహ్మడు పెద్ద జీతం అడగటానికి బిడియపడి తనకు చేతగాని ఉద్యోగం అడుగుతున్నాడుగదా!" అనుకుని, సత్యవాదితో, "రేపు నీకు అసత్యవాది పని ఇస్తాలేవయ్యా! అది బాగా చేస్తే ఇక నుంచీ ఆ ఉద్యోగం నువే చేద్దువుగాని!" అన్నాడు.

మర్నాడు సత్యవాది సభకు వచ్చి అసత్యవాది కూచునే కుర్చీలో కూచున్నాడు. రాజుగారు మిగిలిన వ్యవహారాలన్నీ చూడటం పూర్తి అయాక అతగాడి కేసి తిరిగి, నవ్వుతూ, "ఏమిటయ్యా, విశేషాలూ?" అని అడిగాడు.

ప్రశ్నించి మంచి అబద్ధం చెప్పటానికి మరొక అవకాశం ఇచ్చాడు.

సత్యవాది బుర్ర గోక్కుని, "అన్నట్టు ఈ సంగతి విన్నారా, మహారాజా? మన చిన్నబ్బాయిగారు ఈ మధ్య వేటకు వెళ్లారు చూడండీ, అప్పుడాయన ఒక బాణం వేస్తే అది ఒక జింక కాలిగిట్టకు తగిలి దాని తలలోంచి దూసుకు పోయిందిట!" అన్నాడు.

"జింక కాలి గిట్టకు తగిలిన బాణం దాని తలలో ఎలా ప్రవేశించిందయ్యా? ఏమిటీ విచిత్రం?" అని రాజు అడిగాడు.

మళ్ళీ సత్యవాది తెల్లమొహం వేశాడు. రాజుగారు అసత్యవాది కేసి తిరిగి, "ఈ చోద్యం ఎలా జరిగిందో నీ కేమన్నా తెలును టయ్యా?" అన్నాడు.

"తెలియకేం, మహారాజా? అబ్బాయి గారు బాణం వేసే సమయానికి ఆ జింక తన కాలి గిట్టతో బుర్ర గోక్కుంటున్నది. అంతకంటె మరేమీ లేదు, మహారాజా!" అన్నాడు అసత్యవాది.

బొంకరా, బొంకరా, పోలిగా అంటే, టంగుటూరి మిరియాలు తాటికాయలంతేసి అన్నాట్ట! అలా అయింది, పాపం, మన సత్యవాది సంగతి. రాజుగారు రెండు అవ కాశాలిస్తే రెండు సార్లూ అతికేటట్టు అబద్ధ మాడలేక పోయాడు. రాజుగారు అతనికి



మరొక అవకాశం ఇద్దాంగదా అనుకుని, "ఇంకేమిటయ్యా విశేషాలూ?" అన్నాడు.

రాజుగారు అడిగి నప్పుడు ఏదో ఒకటి చెప్పాలిగా? అందుకని సత్యవాది, "మరేం లేదు, మహారాజా! కిందటి నెల వరద లప్పుడు నదిలో ఇంత బండరాయి తేలి కొట్టుకు వచ్చిందిట!" అన్నాడు.

"బండరాయి తేలట మేమిటి? కొట్టుకు రావట మేమిటి? అంత పని ఎలా జరిగిం దయ్యా?" అన్నాడు రాజు.

సత్యవాది బుర్ర ఖాళీ! ఆయన అసత్య వాది కేసి చూసి బెల్లం కొట్టిన రాయిలా ఉండి పోయాడు.

"రాయి నీటిలో ఎలా తేలి కొట్టు కొచ్చిందో నీ కేమన్నా తెలుసుటయ్యా?" అని రాజు అసత్యవాదిని అడిగాడు.

"మరేం లేదు, మహారాజా! కిందటి సంవత్సరాది ప్రాంతాల ఏటి ఒడ్డున ఒక సొరతీగ మొలిచి ఈ బండరాయి చుట్టూ పెన వేసుకుంది. వేసవికి అది కాయలతో సహా ఎండిపోయింది. ఏటికి వరద రాగానే ఆ పాదంతా నీటిలో పడి కొట్టుకొచ్చింది. సొరకాయలున్నాయి చూడండి అవన్నీ డొల్ల అయిపోయి పాదుతో బాటు రాయిని కూడా తేల్చాయి. రాయితో సహా పాదంతా కొట్టుకు వచ్చింది. ఆ విషయమే సత్యవాది మీతో చెప్పారు!" అన్నాడు అసత్యవాది.

నిజం కురుచా, అబద్ధం పొడవూ అని సామెత. సత్యవాది తన బుర్ర చాలా కురుచ అని గ్రహించి, తనకు అసత్యవాది పదవి వద్దనీ, సత్యవాదిగానే పని చేస్తూ ఉంటాననీ రాజుగారికి విన్న వించుకున్నాడు.

"నీ యిష్టం!" అని రాజు సత్యవాది జీతం కాస్త పెంచాడు. దానితో సత్యవాది సంతృప్తి పడ్డాడు.

"అందుచేత అబద్ధం చెప్పటం తేలిక అనుకోకండి," అంటూ తాతయ్యా కథ ముగించాడు.






# పిశాచం వదిలింది

గుండు భీమన్న ఒక ఇంటివాడై, తన భార్య అయిన మహలక్ష్మితో సుఖంగానే కాపరం చేస్తున్నాడు. ఒక రాత్రి మహలక్ష్మి నిద్రపోతూ కొద్దిగా గురకపెట్టిందీ. తన భార్యను ఏదో పిశాచం పట్టుకుని అలా గుర్రుమంటున్నదని వాడికి సంధేహం కలిగి, తెల్లవారుతూనే భూతవైద్యుడి కోసం బయలు దేరాడు. తన భర్తను అనుక్షణమూ వెయ్యి కళ్ళతో కనిపెట్టి ఉండే మహలక్ష్మి, "ఎక్కడికో చెప్పకుండా పోతున్నారే?" అన్నది.

"భూతవైద్యుడితో అవసరంగా మాట్లాడాలి," అన్నాడు భీమన్న.

"భూతవైద్యుడితో మాట్లాడాలంటే మీరే వెళ్ళాలా? నౌకరును పంపించి పిలిపిద్దాం," అన్నది మహలక్ష్మి.

"నిజమే కాని, నేను భూతవైద్యుడితో మాట్లాడే మాటలు నువు వినగూడదే?" అన్నాడు భీమన్న.

"వినగూడక పోతే వినను," అంటూ మహలక్ష్మి నౌకరును పంపించి భూత వైద్యుణ్ణి పిలిపించింది.

భీమన్న భూతవైద్యుణ్ణి ఒక గదిలోకి తీసుకుపోయి, "నా భార్య శరీరంలో ఏదో పిశాచం చేరింది. నిద్రలో అది భయంకరంగా గుర్రుగుర్రు మని నన్ను భయపెడుతున్నది. దాన్ని వదలగొట్టటానికి ఏమైనా చెయ్యాలి," అన్నాడు. భూతవైద్యుడికి నిజం తెలిసిపోయింది. తన భార్య నిద్రలో గురకపెడితే అది పిశాచం అనుకుంటున్నాడు భీమన్న.

భూతవైద్యుడు తన పంట పండిందనుకుని, "అలాగా, పిశాచాన్ని వదిలించటానికి చాలా పెద్ద తంతు ఉన్నది. ఎంతలేదన్నా రెండువేలు ఖర్చవుతుంది," అన్నాడు.

"ఎంత ఖర్చయినా సరే ఇస్తాను," అన్నాడు భీమన్న. ఈ ఇద్దరి సంభాషణా

చాటు నుంచి మహాలక్ష్మి విన్నది. భూత వైద్యుడిమీద ఆమెకు చాలా కోపం వచ్చింది. ఆయన వెళ్ళిపోయేటప్పుడు ఆమె వచ్చి, "ఈ పూట మీరు మా ఇంటనే భోజనం చెయ్యాలి," అన్నది. భూతవైద్యుడు సరే నన్నాడు. మహాలక్ష్మి భోజనం దగ్గిర భూత వైద్యుణ్ణి బాగా ఎక్కతొక్కనట్టు తినిపించింది. భుక్తాయాసంగా ఉండటాన భూత వైద్యుడు అరుగు మీద నడుము వాల్చి కునుకుతీశాడు. పూటుగా తిని ఉన్నాడేమో, నిద్రలో గురక పెట్టసాగాడు.

మహాలక్ష్మి తన భర్తకు భూతవైద్యుణ్ణి చూపించి, "చూశారా, ఈ భూతవైద్యు డెంత ద్రోహం చేశాడో. నా ఒంటో ఉన్న లక్ష్మిని కాజెయ్యాలని వీడు ఒక పిశాచాన్ని నా పైకి పంపకం చేశాడు. రాత్రి అది నా ముక్కులో నుంచి ప్రవేశించే సరికి లక్ష్మి దాన్ని తన్ని తరిమేసింది. భూతవైద్యుడి చేతబడి బెడిసి కొట్టటం చేత వాడు పంపకం చేసిన పిశాచం ఇప్పుడు వాణ్ణే ఆవహించింది. అది ఎలా గుర్రు పెడుతున్నదో చూడండి! వీణ్ణి దూరంగా ఉంచకపోతే మన లక్ష్మిని కాజేస్తాడు," అని చెప్పింది.

"అదా కథ?" అంటూ భీమన్న, నిద్రపోయే భూతవైద్యుణ్ణి ఒక్క గుంజుగుంజి లేపి, "ఓరే, పిశాచంగాడా! తక్షణం నా యింటో నుంచి బయటికి నడు! మళ్ళీ నాకు నీ ముఖం చూపించావంటే చంపేస్తాను!" అని అరిచాడు.

అసలే నిద్ర కలతన లేచిన భూత వైద్యుడు కంగారుపడి, దయ్యం పట్టిన వాడల్లే బయిటికి పరిగెత్తాడు.

ఇది జరిగినాక భీమన్న తనకు ఏ వెర్రి మొర్రి ఆలోచన తట్టినా ముందు భార్యకు చెప్పకుండా తాను ఏ నిర్ణయమూ చేసే వాడుకాడు. ఈ విధంగా వాళ్ళు ఏ చిక్కులూ లేకుండా కలకాలం సుఖంగా కాపరం చేశారు. [సమాప్తం]





# అయోధ్యా కాండ

కొంతసేపు భరతుడు తండ్రి కోసం శోకించి, "అయితే, అమ్మా, ఆయన ఆఖరు క్షణంలో నా కేమన్నా చెప్పాడా? ఆయన ఆఖరు మాటలేమిటి?" అని అడిగాడు.

"'ఓ రామా, ఓ లక్ష్మణా, ఓ సీతా' అంటూ ప్రాణాలు వదిలారు, నాయనా," అన్నది కైకేయి. భరతుడు ఆశ్చర్యంతో, "అదేమిటి? రాముడూ, సీతా, లక్ష్మణుడూ దగ్గిర లేరా?" అని అడిగాడు.

"అరణ్య వాసానికి వెళ్ళారుగా, నాయనా? రాముడు నారబట్టలూ, జడలూ ధరించి అరణ్యానికి వెళుతుంటే, సీతా, లక్ష్మణుడూ కూడా వెళ్ళారు," అన్నది కైకేయి.

భరతుడు మరింత ఆశ్చర్యపడి, "ఏం? రాముడు ఏం పాపం చేశాడు? అతను పాడుపనులేవీ చేయడే! భ్రూణహత్య చేసిన వాడికి విధించినట్టు అతనికి అరణ్య వాస శిక్ష ఎందుకు వేశారూ?" అన్నాడు.

"అదేం కాదులే! మహారాజు రాముడికి పట్టాభిషేకం చేసే యత్నంలో ఉన్నట్టు విని, నేనాయనను రెండు వరాలు కోరాను: ఆ పట్టాభిషేకం నీకు చేసి, రాముణ్ణి పధ్నాలుగేళ్ళు అరణ్య వాసానికి పంపమన్నాను. మహారాజు సరే నన్నారు. కనక వసిష్ఠుడు మొదలైన వారంతా చెయ్యవలసిందంతా చేస్తారు, నీవు చక్కగా పట్టాభిషేకం చేసుకో!" అన్నది కైకేయి.

కైకేయి చెప్పిన ఈ మాటలు విని భరతుడు మండిపడి పెట్టవలసిన నాలుగు మాటలూ పెట్టాడు. "నీవు మొగుణ్ణి



చంపావు, రాముణ్ణి అడవికి పంపావు, నీ ముఖం చూస్తే పాపం!" అన్నాడు. "జ్యేష్ఠుడికి రాజ్యాభిషేకం జరగటం క్షత్రియవంశ ధర్మ మని నీకు తెలియదా? రామలక్ష్మణులు లేకుండా నేనీ రాజ్యభారం ఎలా మోయగల ననుకున్నావు?" అని అడిగాడు. "నే నిప్పుడే వెళ్ళి ఆ రాముణ్ణి పిలుచుకు వచ్చి రాజ్యాభిషేకం చేసి అతనికి దాస్యం చేస్తాను," అని తల్లితో చెప్పాడు. ఇంత పని చేసినందుకు కైకేయిని నిప్పుల్లో పడమన్నాడు, లేదా అరణ్యానికి వెళ్ళమన్నాడు, అదీ కాకపోతే గొంతుకు ఉరిపోసుకు చావమన్నాడు.

ఇంతలో మంత్రులు వారున్న చోటికి వచ్చారు. భరతుడు వారితో తనకు రాజ్యాకాంక్ష ఏమీ లేదనీ, రాజ్యం కావాలని తాను తన తల్లితో చెప్పి ఉండలేదనీ, కైకేయి తన తండ్రిని వరాలు కోరటంగానీ, సీతా రామ లక్ష్మణులు అరణ్యానికి వెళ్ళిపోవటంగాని, దూరదేశంలో ఉన్న తనకూ, శత్రుఘ్నుడికి తెలియనే తెలియవనీ స్పష్టంగా చెప్పేశాడు.

తరవాత భరత శత్రుఘ్నులు కౌసల్య వద్దకు వెళ్ళారు. ఆమెను ఆలింగనం చేసుకుని ఆమెతోబాటు తాముకూడా ఏడ్చారు. ఆమె భరతుడితో కైకేయి తనకు చేసిన ద్రోహం గురించి చెబుతూంటే భరతుడికి తననుకూడా తన తల్లితో జతచేసినట్టు అనిపించింది. రాముడి అరణ్యవాసానికి తాను సమ్మతించలేదని అతను ఘోరమైన ఒట్లు పెట్టుకుని వేదన పడ్డాడు. కౌసల్య అతన్ని ఊరడించింది.

దుఃఖ సముద్రంలో ఉన్న భరతుడితో వసిష్ఠుడు, "నాయనా, ఈ విచారం కట్టిపెట్టి దశరథ మహారాజుకు ఉత్తర క్రియలు చెయ్యి," అని హెచ్చరించాడు. తైలభాండం నుంచి పైకి తీసిన తండ్రి శవాన్ని చూసి భరతుడు, "నాయనా, నీవు

పోయావు, రాము డడవిలో ఉన్నాడు, ఈ రాజ్యభారం ఎవరు మోస్తారు ?" అని దుఃఖించాడు.

దశరథుణ్ణి పల్లకిలో ఎక్కించి నగరం బయటకి తీసుకు పోయారు. శవానికి ముందుగా పురజనులు, వెండి బంగారు నాణాలు వెదజల్లుతూ, చందనమూ, అగరూ, గుగ్గిలమూ, మొదలైన ధూపాలు వేస్తూ నడిచారు. దశరథుడి భార్యలు పల్లకీలలో వెళ్ళారు. శవాన్ని చితిపై పెట్టినాక దశరథుడి భార్యలు భరతుడితో బాటు చితి చుట్టూ అప్రదక్షిణంగా తిరిగారు. భరతుడు తండ్రికి నిప్పు పెట్టినాక అందరూ నగరానికి తిరిగి వచ్చారు.

భరతుడు తండ్రికి పది దినాలు మైల పట్టి తరవాత రెండు రోజులపాటు శ్రాద్ధాలు చేశాడు. బ్రాహ్మణులకు అన్న దానమూ, వస్త్ర దానమూ, ఇతర దానాలూ చేశాడు. పదమూడో రోజు అస్థిసంచయనం చేసేటప్పుడు భరతుడూ, అతనితోపాటు శత్రుఘ్నుడూ తండ్రిని తలుచుకుని వివశులై విలపించారు.

తరవాత ఒక చోట భరత శత్రుఘ్నులు జరిగిన దాన్ని గురించి మాట్లాడుకుంటున్నారు; తన అన్న అయిన లక్ష్మణుడు



తన తండ్రికి ఎందుకు అడ్డుపడలేదా అని శత్రుఘ్నుడు ఆశ్చర్యం వెలిబుచ్చుతూండగా, మంథర మహారాణీలాగా అలంకరించుకుని ఆట కోతిలాగా తయారై అటుగా వచ్చింది. ద్వారపాలకులు దాన్ని పట్టుకుని శత్రుఘ్నుడి దగ్గిరికి తెచ్చి, "ఇదుగో! అన్ని పాపాలకూ మూలమైన మంథర!" అన్నారు. శత్రుఘ్నుడు కోపావేశంలో మంథరను పట్టుకుని దాన్ని హతమార్చే ఉద్దేశంతో జరజరా ఈడ్చుకుపోసాగాడు. మంథర వెంట ఉండే దాసీలు బెదిరిపోయి కౌసల్య దగ్గిరికి పరిగెత్తారు. మంథర కప్పు ఎగిరిపోయేటట్టు కేకలు



పెట్టసాగింది. కైకేయి మంథరను విడిపించటానికి వస్తే శత్రుఘ్ను డామెను నోటికి వచ్చినట్టు తిట్టాడు.

అప్పుడు కైకేయి పరిగెత్తి వెళ్ళి భరతుణ్ణి పిలుచుకు వచ్చింది.

భరతుడు శత్రుఘ్నుడితో, "ఆడదాన్ని చంపుతావా? ఈ మాట తెలిస్తే రాముడు మన ముఖం చూస్తాడా? రాముడి ఆగ్రహానికి గురికావలిసి వస్తుందని ఆగాను కాని, నేను కైకేయిని ఎప్పుడో చంపకపోయానా? ఆ గూనిదాన్ని వదిలిపెట్టు," అన్నాడు.

దశరథుడు పోయిన పధ్నాలుగో రోజు ఉదయం పెద్దలందరూ భరతుడి వద్దకు వచ్చి, "రాజపుత్రా, రాజ్యానికి నాయకుడు లేడు. అదృష్టవశాత్తూ జనంలో అరాజకం సాగలేదు. నీవు వెంటనే పట్టాభిషేకం చేసుకోవటం మంచిది," అన్నారు.

భరతుడు వారితో, "జ్యేష్ఠుడే రాజు కావటం మా వంశాచారం. అందుచేత నన్ను రాజు కమ్మని మీరు కోరటం ఉచితం కాదు. నా తల్లి కోరిందిగదా అని పట్టం కట్టుకోను. నేను అరణ్యానికి వెళ్ళి జ్యేష్ఠుడైన రాముణ్ణి రాజును చేసి తీసుకువచ్చి, అతనికి బదులుగా నేనే అరణ్యవాసం చేస్తాను. రాజ్యాభిషేకం అరణ్యంలోనే జరుగుతుంది గనక అభిషేక సంబారాలన్నీ నా వెంట తీసుకు పోవటానికీ, నాతోబాటు చతురంగబలాలతో కూడిన సేనను వెంట బెట్టుకు వెళ్ళటానికీ అవసరమైన ఏర్పాట్లు చేయండి," అన్నాడు.

భరతుడి ప్రయాణానికి బ్రహ్మాండమైన ప్రయత్నాలు జరిగాయి. అరణ్యం మధ్యగా చెట్లు నరికి, భూమి చదును చేసి దారులు వేశారు. నదులపై వంతెనలు కట్టారు. దారిలో అడ్డు వచ్చిన గోతులూ, చెరువులూ పూడ్చారు. దారి పొడుగునా అక్కడక్కడా బావులు తవ్వారు. విడిదికి తగిన స్థలాలు చూసి అక్కడ వీధులూ, ఇళ్ళూ గలిగిన



శిబిరాలు నిర్మించారు. ఇలాటి శిబిరాలు సరయూ నదీ తీరం నుంచి గంగా తీరం వరకూ ఏర్పాటు చేశారు.

ఆ రాత్రి శంఖాలు మోగటమూ, భేరి వాయింపూ, వందిమాగధుల స్తోత్రాలూ విని భరతుడు నిద్ర లేచి, కంట నీరు పెట్టుకుని, "నేను రాజునుగాను. నాకు స్తోత్ర పాఠాలూ, మంగళ వాద్యాలూ వద్దు," అని వాటిని నిలిపించాడు.

వసిష్ఠుడు తన పరివారంతో రాజసభకు వచ్చి, భరతుడి పట్టాభిషేకం జరిపించే ఉద్దేశంతో పురప్రముఖులనూ, మంత్రులనూ, గణనాయకులనూ, భరతుణ్ణీ, శత్రుఘ్నుణ్ణీ, ఇతర ముఖ్యులనూ వెంటనే పిలుచుకు రమ్మని దూతలను పంపాడు. త్వరలోనే అందరూ వచ్చి సభను అలంకరించారు. దశరథుడు జీవించి ఉన్నప్పటిలాగే సభ కళకళలాడింది.

అప్పుడు అందరి సమక్షంలోనూ వసిష్ఠుడు భరతుణ్ణి రాజ్యాభిషేకం చేసుకోవలసిందిగా కోరాడు. భరతుడు పెద్దలతో చెప్పిన మాటలే పేరోలగంలో మళ్ళీ చెప్పి, "నేను మీ అందరి సమక్షంలోకి రాముణ్ణి తీసుకురావటానికి శాయశక్తులా యత్నిస్తాను. అతను రాకపోతే లక్ష్మణుడిలాగే నేను కూడా రాముడితోపాటు వనవాసం ఉండిపోతాను. నా ప్రయాణానికి ఏర్పాట్లు ఇదివరకే ఆరంభమయాయి. మార్గం వేసేవారూ, మార్గరక్షకులూ మొదలైనవారు ముందే వెళ్ళిపోయారు. ఇంక నేను బయలుదేరటమే తరవాయి," అన్నాడు.

ఈ మాటలకు అందరూ సంతోషించారు. ప్రయాణానికి సేనలను ఆయత్తం చేయవలసిందిగా సుమంత్రుడు సేనాధ్యక్షులకు చెప్పాడు. అయోధ్యా నగరానికి మళ్ళీ ప్రాణం వచ్చినట్టయింది.

మర్నాడు భరతుడు పెందలాడే లేచి ప్రయాణమయాడు. అతని వెంట తొమ్మిది



వేల ఏనుగులూ, అరవైవేల రథాలూ, లక్ష గుర్రాలూ యోధులతో సహా కదిలాయి. కౌసల్యా, సుమిత్రా, కైకేయీ వాహనాలలో బయలుదేరారు. కైకేయికి పట్టిన దయ్యం దిగిపోయింది. తాను చేసినదానికి పశ్చాత్తాపపడుతూ ఆమె మిగిలినవారి కంటె ముందు కదిలింది. పౌరులు గుంపులు గుంపులుగా భరతుణ్ణి వెంబండించారు. రాముడికి ఇష్టులైనవారూ, వర్తకులూ, ఇతరులూ రాముణ్ణి చూడటానికి తాము కూడా ప్రయాణం కట్టారు. అనేక వేలమంది బ్రాహ్మణులు ఎడ్లబళ్లెక్కి భరతుడి వెంట ప్రయాణమయారు.

ఇంత పెద్ద బలగాన్నీ వెంటబెట్టుకుని భరతుడు గంగాతీరాన్ని శృంగిబేరపురం వద్ద చేరుకుని, తన సైన్యాన్ని నది వెంబడి అక్కడక్కడా విడియమని ఉత్తరు విచ్చాడు. అతను మంత్రులతో, "మనం ఈ రాత్రికి ఈ తీరాన విశ్రమించి రేపు ఉదయానే గంగ దాటుదాం. నే నిప్పుడు నదిలో దిగి మా తండ్రికి తర్పణాలు వదులుతాను," అన్నాడు.

మహా సముద్రంలాటి సేన ఒకటి వచ్చి గంగ ఒడ్డు వెంబడి విడియటం గుహుడు గమనించాడు. రథంయొక్క టెక్కెం గమనించి ఆ రథం భరతుడిది అయి ఉంటుందని తెలుసుకున్నాడు. అతను తన అప్తులను చేరబిలిచి, "భరతుడు ఇంత సేనతో ఎందుకు బయలుదేరి వచ్చి వుంటాడంటారు? రాముడు వనవాసం పూర్తిచేసి వచ్చి రాజ్యం అడుగుతాడేమో, అతన్ని అరణ్యంలోనే చంపేద్దామని వచ్చివుంటాడు. మనం రాముణ్ణి ఎలాగైనా రక్షించాలి. అతను నా మిత్రుడు. అందుచేత మన వాళ్ళను అయిదు వందల పడవలు సిద్ధం చెయ్యమనండి. ఒక్కొక్క పడవలోనూ నూరేసిమంది యువకులను ఏర్పాటు చేసి, పడవలు గంగకు అడ్డంగా ఉంచి, అందు

లోనే మాంసమూ, ఇతర ఆహారాలూ, ఉంచుకుని జాగ్రత్తగా ఉండండి. భరతుడికి రాముడి పట్ల ద్రోహబుద్ధి లేకపోతే అతన్నీ, అతని సైన్యాన్నీ నిరాటంకంగా నది దాటనిద్దాం, లేకపోతే మన పడవలతో అటకాయింతాం," అన్నాడు.

గుహుడు ఈ కట్టుదిట్టాలు చేసిన అనంతరం చేపలూ, మాంసాలూ, తేనే కానుకగా తీసుకుని భరతుడి వద్దకు వెళ్ళాడు. గుహుడు వస్తూండటం ముందుగానే తెలుసుకుని సుమంత్రుడు భరతుడితో, "నిన్ను చూడటానికి బోయ రాజైన గుహుడు వస్తున్నాడు. ఇతను బలవంతుడు, సమర్థుడు, రాముడికి మంచి స్నేహితుడు. అతన్ని తగిన విధంగా గౌరవించి నట్టయితే రామలక్ష్మణులు అరణ్యంలో ఎటు వెళ్ళారో వారి జాడకూడా తెలుస్తుంది," అన్నాడు.

"అయితే ఆ గుహుణ్ణి వెంటనే నా దగ్గిరికి తీసుకురా," అని భరతుడు సుమంత్రుణ్ణి పంపాడు. గుహుడు భరతుడి సమక్షానికి వచ్చి, తాను తెచ్చిన కానుకలు ఇచ్చి, "తమరు వస్తారని ముందుగా తెలిసివుంటే మంచి ఆతిథ్యమూ, స్వాగతమూ ఏర్పాటు చేసి ఉండేవాణ్ణి. ఈ రాత్రికి మా ఆతిథ్యం స్వీకరించి రేపు ముందుకు సాగిపోదురుగాని," అన్నాడు.

భరతుడు గుహుడికి సంతోషం కలిగేటట్టుగా, "రాజా, ఇంత సేనకు నీవు ఒక్కడవే ఆతిథ్యం ఇస్తానన్నావు, ఆ మాటకన్న మాకు నీ నుంచి హెచ్చు గౌరవం ఇంకేంకావాలి? మేము భరద్వాజ ముని ఆశ్రమానికి వెళ్ళాలి, దారి చెప్పగలవా? ఇక్కడినుంచి దారి చాలా కష్టమని విన్నాను," అన్నాడు.

"బాణాలు ధరించి మా బోయలు మీ వెంట వస్తారులెండి. నేనుకూడా వెంట ఉంటాను. అందుచేత మీకు దారి వెతుక్కునే పని ఉండదు," అన్నాడు గుహుడు.



ప్రపంచపు వింతలు :

# దయ్యపు వెదుళ్లు

సింహళంలోని కండి అనే నగరానికి సమీపంలో జగత్ప్రసిద్ధమైన బొటానికల్ గార్డెన్స్ ఉన్నాయి. వీటి విస్తీర్ణం 150 ఎకరాలు. ఇక్కడి బర్మా వెదుళ్ళు ప్రపంచంలో ఎక్కడా లేనంత పరిమాణం అందుకున్నాయి. ఈ దయ్యపు వెదురుగడల ఎత్తు 120 అడుగులు, లావు ఒక్కొక్క అడుగు!





# ప్రశ్నోత్తరాలు

1. *సూరి, అరికెల*

"భూతాలు చేసిన పెళ్ళి"లో అజీబ్ సయ్యద్‌తో, "ఈ రోడ్లు మనం వేయించామా?" అంటాడు. ఆ కాలంలోకూడా "రోడ్డు" అనే పదం ఉపయోగించబడుతూండేదా?

రోడ్డు అనే పదమేగాదు, మనం కథలో వాడిన ఏ పదమూ ఆ కాలంలోగాని, ఆ దేశంలోగాని లేక పోవచ్చు. ఆ నాటి కథను మనకు తెలిసిన భాషలో మనం చెప్పు కుంటున్నాం. ఆ కాలంలో రోడ్లే లేకపోతే అది వేరే సంగతి.

2. *వై. మహేంద్రద్, ఖమ్మంమెట్టు*

మేముకూడా తాతయ్య కథల్లాటివి పంపవచ్చా?

పథకం కొద్దిగా మార్చి తాతయ్య కథలు మళ్ళీ ప్రారంభించాము. ఇందులో శ్లోకాలు అవసరం లేదు. ఇటువంటి కథలు పాఠకులు కూడా పంపవచ్చు.

3. *సియ్యాద్రి గురుమూర్తి, ఖర్గపూరు*

చంద్రుని నీడ భూమిపై పడితే అది సూర్యగ్రహణం ఎలా అవుతుంది?

చంద్రుడి నీడ పడిన ప్రాంతాలవారికి సూర్యుడు కనిపించడు, చంద్రుడు అడ్డుగా ఉంటాడు. అదే సూర్యగ్రహణం.

4. *బి. రామయ్య, లద్నూరు*

చందమామా! ప్రశ్నోత్తరాల శీర్షికలో ప్రశ్నలు అన్ని మీ గురించే వేస్తే బాగుండదేమో?

బాగుండదు. ఆ సంగతి ప్రశ్న లడిగేవారు గ్రహించాలి. మరి మీ కార్డులో ఉన్న అయిదు ప్రశ్నలూ మా గురించే ఉన్నాయేమిటి? వాటిలో అఖరు ప్రశ్న: "చంద మామ గురించి సందేహాలు అనేకాలున్నాయి. ఒకేసారి తీర్చుకునేదెలాగ?" ప్రశ్నలు పంపే ఇతరులు కూడా మీ వంటి వారేగదా?

5. మందలపర్తి భుజంగరావు, హైదరాబాదు

డార్విన్ సిద్ధాంతరీత్యా మానవులు కోతుల నుంచి వుద్భవించారని వుంది. వేదాంత రీత్యా బ్రహ్మదేవునిచే సృష్టింప బడినారని వుంది. ఇందులో ఏది నమ్మవచ్చు? ఆధారాలేమైనా ఉన్నాయా?

రెండూ నమ్మవచ్చు గద. బ్రహ్మదేవుడే మనుషులను కోతుల నుంచి పుట్టించాడను కుంటే సరిపోలేదా? ఇక ఆధారాల మాట కొస్తే, మనిషిలో బ్రహ్మదేవుడి పోలికల మాట ఏమోగాని, కోతి పోలికలు మనకు స్పష్టంగా కనిపిస్తూనే ఉన్నాయి.

6. సి. కుమారస్వామి, అల్లీపురం

"చందమామ"లో ప్రచురించే "ప్రపంచపు వింతలు" మీరు సేకరిస్తారా? లేక పాఠకులు పంపిస్తారా?

మేమే సేకరిస్తాం.

7. జె. వేణుగోపాల్, బళ్ళారి

గుండు భీమన్న కథ అయిపోతున్నదని విని చాలా దుఃఖిస్తున్నా. ఇంకో రకం భీమన్నను ప్రారంభించి మమ్మల్ని ఆనందింప జేస్తారా?

గుండు భీమన్న వంటివాడు అన్నప్పుడల్లా వస్తాడా. గుండు భీమన్న తరవాత పరోప కారి పాపన్న రాబోతున్నాడు. ఇతను ఇంకొక రకం మనిషి.

8. అడపా చిదానందం, వాల్తేరు

అన్నయ్యా, ప్రేమతో ఎన్ని సార్లు అన్నయ్యా అని పిలిచినా వాత్సల్యంతో ఏనాడయినా తమ్ముడూ అన్నావా?

వాత్సల్యం లేక కాదు, తమ్ముడూ! ఎంత సేపూ సమాధానా లిచ్చిన ప్రశ్నలే వేస్తుంటే ఏం చెయ్యనూ?

9. జి. శారదాదేవి, నారాయణపురం

'చందమామ' నీకో చక్కని కథ పంపుతాను. అందులో వుండె అక్షర దోషములను సవరించి ప్రచురించుకొనగలవా?

మాకున్నూ అది చక్కని కథగా కనిపిస్తే, తప్పకుండా సవరించి ప్రచురిస్తాం.

Photo by Pranlal K. Patel



బహుమతి
పొందిన వ్యాఖ్య

విరిగిన బండి

పంపినవారు :
మ. ము. ఎ. షరీఫ్, అమలాపురం

Photo by A. S. Lakdawala



బహుమతి
పొందిన వ్యాఖ్య

నడుపదు లెండి

పంపినవారు:
మ. ము. ఎ. షరీఫ్, అమలాపురం

# ఆత్మ వంచకుడు ★

[రామతీర్థ కథ]

ఒక ఊళ్ళో ఒక వెర్రిబాగుల వాడుండే వాడు. వాడు ఒకనాడు వీధిలోకి వెళ్ళి చాలామంది పిల్లలను పోగు చేసి, వేళా కోళానికి వాళ్ళతో, "గ్రామ పెద్దగారింట మిఠాయిలు పంచి పెడుతున్నారు, వెళ్ళండి," అన్నాడు.

పిల్లలుగద, మిఠాయి దొరుకుతుం దంటే ఊరుకుంటారా? వాళ్ళందరూ ఒక గుంపుగా బయలుదేరి, దారిలో కనిపించిన పిల్లలను కూడ గలుపుకుని గ్రామ పెద్దగారింటికి వెళ్ళారు.' తీరా అక్కడికి వెళ్ళాక మిఠాయీ లేదు, పంచటమూ లేదు. గ్రామపెద్దగారికి ఈ మిఠాయి గొడవే తెలియదు. తమను ఏడిపించటానికి ఆ మనిషి మోసం చేశాడుగదా అని పిల్లవాళ్ళు అనుకుం టూండగా వారికి ఆ వెర్రిబాగులవాడే తమ వెంట కనిపించాడు.

"ఏమయ్యా, మాకు అబద్ధం చెప్పావు బాగానే ఉంది. మా వెంట నీవు కూడా వచ్చావేమిటి? ఇక్కడ మిఠాయిలుండవని నీకు తెలుసుగదా?" అని పిల్లలు అడిగారు.

దానికా వెర్రిబాగులవాడు, "మీరంతా వెళుతుంటే చూసి, ఒక వేళ నిజంగానే ఇక్కడ మిఠాయి పంచుతున్నారేమోనని నాకూ అను మానం వేసింది," అన్నాడు.



## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫొటోల వ్యాఖ్యలు 1962 జూలై నెల సంచికలో ప్రకటింపబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ మే నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

## మే నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : విరిగిన బండి

రెండవ ఫోటో : నడువదు లెండి

పంపినవారు : మహమ్మద్ ముస్తఫ అలీ షరీఫ్,

అమలాపురం. (తూర్పు గోదావరి జిల్లా)

బహుమతి మొత్తం రు. 10/– ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# అట్టచివరి బొమ్మ

ధృతరాష్ట్రుడు యుద్ధరంగానికి బయలుదేరాడని తెలిసి ధర్మరాజు కృష్ణుణ్ణీ, సాత్యకినీ, ధృతరాష్ట్రుడి కొడుకై ఉండిన్నీ తన పక్షాన యుద్ధం చేసిన యుయుత్సుణ్ణీ వెంట బెట్టుకుని బయలుదేరాడు. వారి వెంట ద్రౌపదీ, ఇతర పాంచాల స్త్రీలూ వచ్చారు. వారంతా శోక సముద్రంలో మునిగి ఉన్నారు.

ధర్మరాజు మొదలైనవారు అంత దూరాన ఉండగానే గంగాతీరం నుంచి ధృతరాష్ట్రుడి వెంట ఉన్న స్త్రీల ఆక్రందనం గొర్రెలమంద అరుపులాగా విన వచ్చింది. ఆ స్త్రీలు ధర్మరాజును చూడగానే దుఃఖంలోనే నానా మాటలూ అని, "ధర్మం తెలిసినవాడనీ, భూతదయగలవాడనీ చెబుతారే, అవన్నీ ఏమయాయి? తండ్రులనూ, తమ్ములనూ, గురువులనూ, కొడుకులనూ, మిత్రులనూ, అందరినీ చంపించావు! భీష్ముణ్ణి చంపించావు, జయద్రథుణ్ణి చంపించావు! అభిమన్యుడు పోయాడు, ఉపపాండవులు పోయారు, ఇంక ఈ రాజ్యం ఎట్లా ఏలుతావు?" అని అడిగారు.

తనను కాకులలాగా చుట్టిముట్టిన స్త్రీలను తప్పించుకుని ధర్మరాజు ధృతరాష్ట్రుడికి నమస్కరించి తన పేరు చెప్పుకున్నాడు. అలాగే మిగిలిన పాండవులుకూడా తమతమ పేర్లు చెప్పుకున్నారు. ధృతరాష్ట్రుడు లాంఛనంగా ధర్మరాజును కౌగలించుకుని పరామర్శించి, కడుపు మండిపోతూ భీముణ్ణి ఆలింగనం చేసుకోబోయాడు. భీముడికి రానున్న ఆపద గుర్తించి కృష్ణుడు భీముణ్ణి వెనక్కులాగి అతనికి బదులుగా భీముడి ఇనప విగ్రహాన్ని అందించాడు. ధృతరాష్ట్రుడు దాన్ని భీముడే అనుకుని కసికొద్దీ బలంగా ఆలింగనం చేసుకుని ముక్కలు ముక్కలు చేసేశాడు. ధృతరాష్ట్రుడి రొమ్ము అదిరి, ఆయన నోటి నుండి రక్తం వెలువడింది. కాని ఆయన పుత్రశోకం కొంత చల్లారింది. ఆయన, "అయ్యో, భీమా! భీమా!" అంటూ కపట దుఃఖం అభినయించాడు.

కృష్ణుడాయనతో, "దిగులు పడవద్దు. నీవు విరిచినది భీముణ్ణి కాదు, భీముడి విగ్రహాన్ని. నీ కొడుకు దుర్యోధనుడు గదా యుద్ధాభ్యాసానికై చేయించిన విగ్రహాన్ని నీవు ధ్వంసం చేశావు. వెర్రివాడా, భీముణ్ణి చంపితే చచ్చిన నీ కొడుకులు తిరిగి వస్తారా? పాండవులు నీకు చేసిన నష్టాన్నే ఆలోచిస్తున్నావుగాని, ఏ దోషమూ ఎరగని ఆ పాండవులకు నీ కొడుకులు చేసిన ద్రోహాలుకూడా కాస్త జ్ఞాపకం తెచ్చుకో. యుద్ధం జరగకుండా నేనూ, విదురుడూ, భీష్మద్రోణులూ చేసిన యత్నాలన్నిటినీ కాదని నీ కొడుకును బలపరిచావు," అన్నాడు. ధృతరాష్ట్రుడు పశ్చాత్తాప పడి, "నీ మాటలన్నీ నిజమే. నా కొడుకులంతా పోయినాక పాండవుల మీద నాకు పుత్రవాత్సల్యం కలుగుతున్నది. వారిని తాకి ఆనందిస్తాను," అని కోరాడు. తరవాత ఆయన పాండవులను తడివి, పరామర్శించి, వారితో మంచిగా మాట్లాడాడు.

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'



బట్టలను
ఎంతో
శుభ్రముగా
ఉతుకుకొనుటకు

# నిరాల

బార్ సబ్బు
వాడండి






తుంగభద్రా యిండస్ట్రీస్ లిమిటెడ్, కర్నూలు.

SP/N3



"గుండమ్మ కథ"లో
ఒక సన్నివేశం



"గుండమ్మ కథ"లో
ఇంకొక సన్నివేశం

